శ్రీమతే రామానుజాయ నమః

శ్రీమద్వరవరమునయే నమః



శ్రీశోభకృత్ నామ సంవత్సర ధనుర్మాస సందర్భంగా

# సాంప్రదాయిక వ్యాస మాలిక- 25
## (తిరుప్పావై వ్యాస మాలిక)

06-01-2024






'పండితరత్న'

డా|| ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అమ్రుగ శింగరాచార్యులు

సమర్పణ: వంగల వేంకట కేశవ అయ్యంగారు



వేంకట కేశవ అయ్యంగారు

# విషయ సూచిక

# మార్గశీర్షమాసవ్రతవైలక్షణ్యమ్

"తిరుప్పావై దివ్య ప్రబంధం వేదసారం" అని మన పూర్వాచార్యుల సూక్తి. వేదంలో మనం తెలుసుకోవలసిన అర్థపంచకం, అంటే, ఆత్మ స్వరూపం, పరమాత్మ స్వరూపం, ఆత్మ పరమాత్మను చేరడానికి తగిన ఉపాయ స్వరూపం, ఆ పరమాత్మను చేరిన తరువాత ఆత్మ పొందే పరమ పురుషార్థమనబడే మోక్షం యొక్క స్వరూపం, ఆ విధంగా ఆ పురుషార్థాన్ని పొందేటప్పుడు జీవునకు అడ్డువచ్చే ఆటంకాల స్వరూపం– అనే ఈ ఐదు విషయాలను తెలియచెప్పేటట్లే, గోదాదేవి మనకు అందించిన తిరుప్పావై ప్రబంధం కూడా ఈ ఐదు విషయాలను తెలియజేస్తున్నందున వేదసారంగా పెద్దలు ఈ ప్రబంధాన్ని సంభావించారు. ఈ ప్రబంధం మార్గశీర్ష వ్రతాన్ని అనుష్ఠించే క్రమాన్ని తెలుపుతున్నది.

అయితే, ఈ వ్రతాన్ని మార్గశీర్ష మాసంలోనే ఎందుకు చేయాలి? ఈ విధంగా ఈ మాసంలోనే గోదాదేవి ఈ వ్రతాన్ని తాను ఆచరించి, మనలను ఆచరించమని ఎందుకు చెప్పింది? అనే విషయాన్ని గమనించి, దీనికి పలు విధాలైన సమాధానాలను మన ఆచార్యులు తెలియజేశారు. "మాసానాం మార్గశీర్షోహం" (మాసాలలో నేను మార్గశీర్ష మాసాన్ని) అని గీతలో శ్రీకృష్ణ పరమాత్మ చెప్పినందున, భగవంతుని స్వరూపమైన మార్గశీర్ష మాసంలో ఈ వ్రతాన్ని చేస్తే ఆ స్వామికి ప్రీతికరం అవుతుంది కనుక, ఈ మాసంలో ఈ వ్రతాన్ని చేయమని మనకు గోదాదేవి ఉపదేశించింది – అనేది ఒక సమాధానం.

ఉత్తరాయణం, దక్షిణాయనం అనే రెండు విభాగాలను కలిగిన ఒక సంవత్సరకాలం దేవతలకు ఒక దినం. ఈ రెండు అయనాలలో, ఉత్తరాయణం

వారికి పగటి కాలం కాగా, దక్షిణాయనం వారికి రాత్రి కాలం. దేవతలకు పగటి కాలం అయిన ఉత్తరాయణం మకరమాసం పుష్య మాసం నుండి ఆరంభం అవుతుంది. ఆ మాసానికి ముందు మాసం అయిన మార్గశీర్ష మాసం దేవతలకు బ్రాహ్మ ముహూర్తం అవుతుంది. ఇది చాలా పవిత్రమైన సాత్వికమైన సమయం. ఈ మాసంలో ప్రతి దినం సూర్యోదయానికి సుమారు 90 నిమిషాల ముందు కాలం బ్రాహ్మముహూర్తంగా చెప్పబడుతుంది. ఇది దేవతలకు, , మానవులకు కూడా బ్రాహ్మ ముహూర్త కాలం. ఈ సాత్వికమైన కాలంలో మన మనస్సు సత్వగుణ ప్రచురంగా ఉంటుంది. ఈ విధంగా సాత్వికమైన కాలంలో, సత్వగుణం అధికంగా ఉండే మనస్సుతో, సాత్విక దైవం అయిన శ్రీమన్నారాయణునో ఆరాధించినట్లయితే, సాత్వికఫలం అయిన పరమపురుషార్థం మనకు సిద్ధిస్తుంది. ఇందువల్ల కూడా గోదాదేవి ఈ వ్రతాన్ని "మార్గళి త్తింగళ్" అని మార్గశిర మాసంలోని బ్రాహ్మముహూర్తంలో ఆచరించమని చెప్పింది.

ఇటువంటి కారణాలు ఒకవైపు ఉండగా, వైదికమైన కారణంకూడా ఈ విషయంలో ఉన్నవని పెద్దలు అంటారు. ప్రాతః కాలంలో దేవతలకు సంబంధించిన ఆరాధనలను, యాగాలను చేయమని అంటూ "ప్రాతరగ్నిమ్ ప్రాతరింద్రగ్ం హవామహే, ప్రాతర్మిత్రావరుణా పాతరశ్వినా, ప్రాతర్భగం పూషణం బ్రహ్మణస్పతిమ్, ప్రాతః సోమముత రుద్రం హువేమ" అని అన్నది. అగ్ని, ఇంద్రుడు, రుద్రుడు మొదలైన సమస్తదేవతలకు సంబంధించిన ఆరాధనలను, హోమాలను ప్రాతః కాలంలో చేయాలని చెప్పింది. అందువల్ల అన్ని కాలాల కంటే దేవతలకు ప్రాతఃకాలం అయిన ఈ మార్గశీర్ష మాసమే దేవతారాధనకు చాలా తగిన కాలం. దేవతలందరిలోనూ పరదేవత, , సాత్విక దేవత అయిన శ్రీమన్నారాయణుని

ఆరాధనకు ఇంత కంటే తగిన కాలం వేరొకటి ఉండదు కదా. పరమ వైదికులైన శ్రీవిష్ణు చిత్తుల ప్రియ పుత్రిక అయిన గోదాదేవి ఈ వైదికరహస్యాన్ని తెలిసిది కనుక, "మార్గళి త్తింగళ్" అని అన్నది.

ఇక్కడ, ఇంకొక విశేషం కూడా గమనించదగినది ఉన్నది. సంస్కృత భాషలో అమర కోశం అనే ఒక నిఘంటు గ్రంథం ఉన్నది. దీనిని రచించిన అమరసింహుడు వైదికుడు కాడు, బౌద్ధుడు. ఈ గ్రంథం సంప్రదాయ గ్రంథం కాదు. అతడు ఆ గ్రంథంలో మార్గశీర్ష మాస పర్యాయపదాలను నిర్దేశిస్తూ " మార్గశీర్షః సహా మార్గః ఆగ్రహాయణికశ్చ సః" అని అన్నాడు. దీనిని బట్టి "మార్గళి త్తింగళ్" అనేది మార్గశిరమాసపర్యాయపదాలలో ఒకటి అని తెలుస్తున్నది. . ఆయనం అంటే, సంవత్సరం. అగ్ర అంటే, ఆరంభభాగం. . మకర మాసంతో దేవసంవత్సరం ఆరంభం అవుతుంది. కనుక దానికి ముందు ఉన్న ధనుర్మాసం, అంటే, మార్గశిర మాసం "ఆగ్రహాయణికః" అని వ్యవహరింపబడుతున్నది. దీనినిబట్టి మార్గశిర మాసం దేవతలకు ప్రాతఃకాలం అనేది లోకవ్యవహారంలో కూడా ఉన్నదని ఏర్పడుతున్నదికదా.

★★★★★

# మది నిఱైంద నన్నాళ్

తిరుప్పావైలో, గోదాదేవి, మొదటి పాశురం ఆరంభంలో "మది నిఱైంద నన్నాళ్" అని అన్నది. ఇక్కడ "మది" అనే శబ్దానికి మనసు, చంద్రుడు అనే రెండు అర్థాలు ఉన్నాయి. ముందుగా, చంద్రుడు అనే అర్థాన్ని గమనిద్దాం. ఆ అర్థాన్ని అన్వయించి గమనించినప్పుడు ఏర్పడే వైదిక రహస్యాలను చూద్దాం.

చంద్రుడు నిండుగా ఉండే దినం అంటే, పున్నమి దినం. ఆనాడు చంద్రుని కళలు పూర్ణంగా ఉంటాయికదా. ఈ పున్నమి దినాన్ని గురించిన ప్రస్తావనను ఇక్కడ గోదాదేవి చేసింది. ఈ పున్నమిదిన గురించి వేదం ఏమని అంటున్నదో చూద్దాం. ఈ పున్నమినాటి నుండి ఆరంభించి గోదాదేవి ఏమి చేయాలని అంటున్నది? " "నీరాడ ప్పోదువీర్" (ధనుర్మాసస్నానం చేయాలనే కోరిక కలిగినవారు రండి) అని స్నానం చేయబోతున్నట్లు తెలిపింది. ఇక్కడ స్నానం అంటే, శ్రీకృష్ణసంశ్లేషమే. ఈ విధంగా వారు తమ భగవత్కామసమృద్ధిని పొందగోరుతున్నారు.

వేదం పున్నమి తిథినిగూర్చి చెబుతూ, దానిని కామసమృద్ధిని కలుగజేసే తిథిగా తెలిపింది. "కామో వై పౌర్ణమాసీ, కామ ఆజ్యమ్. కామేనైవ కామం సమర్ధయతి"– పున్నమి కామానికి మిక్కిలి తగినది– అని అన్నది. గోదాదేవి కృష్ణ సంశ్లేషం కోసం ఈవ్రతాన్ని చేయబోతున్నది. ఆ కోరిక తీరడానికి తగిన తిథిగా వేదం చెప్పిన పున్నమినాడు ఆరంభిస్తున్నది. ఇందువల్ల గోదాదేవి పున్నమినాడు ఈ మార్గశీర్ష వ్రతాన్ని ఆరంభించడం వేదవిధికి చాలా అనుకూలం.

గోదాదేవి తాను ఈ వ్రతాన్ని ఆరంభించే దినాన్ని "చంద్రుడు నిండుగా ఉండే దినం" అని మాత్రమే కాకుండా, "నన్నాళ్" (సుదినం) అని కూడా అన్నది. వేదం "పూర్ణా పశ్చా దుత పూర్ణా పురస్తాత్, ఉన్మధ్యతః పౌర్ణమాసీ జిగాయ" అని

“పౌర్ణమస్యుదగా చ్ఛోభమానా” అని పున్నమి దినాన్ని గురించి అన్నది. ఇక్కడ మొదటి వేదవాక్యంలో పున్నమి దినం పూర్ణశబ్దం చేత నిర్దేశింపబడింది. ఈ పూర్ణశబ్దాన్ని గోదాదేవి “నిఱైంద” అనే పదంతో నిర్దేశించింది. రెండవ శ్రుతివాక్యంలో ఈ పున్నమి దినం “శోభమానా” అని సుదినంగా నిర్దేశింపబడింది. ఆ అర్థాన్నే ఇక్కడ గోదాదేవి “నన్నాళ్” అని అంటూ తెలిపింది.

ఈ విధంగా తిరుప్పావై ప్రబంధం ఆరంభంలో పాశురంలోని ఆరంభ వాక్యంలోనే గోదాదేవి గొప్ప శ్రుత్యర్థాలను కూర్చింది.

★★★★★

# ఆండాళ్ తిరుప్పావైలో నవవిధభక్తిప్రకారాలు

భక్తిః సాధనసాధ్యరూపవిధయా ద్వేధా భవే, త్త్వత్ర యాం
శ్రీగోదా వ్రతపాలనాత్ దిశతి సా సాధ్యేతి విద్వన్మతమ్,
కింత్వాభాతి నవప్రకారవిదితా ఽ న్యా సాధనత్వేన యా
ప్రోక్తా సాపి పద్యై రిహేతి విశదీకుర్వంతి ధీశాలినః.

భక్తి అనేది ఒక మోక్షసాధనం అని శ్రీకృష్ణపరమాత్మ గీతలో ఉపదేశించాడు. ఈ భక్తి –సాధనభక్తి అని, సాధ్యభక్తి అని రెండు విధాలుగా ఉంటుంది. సాధన భక్తి అంటే, భగవంతుని విషయంలో ఉండే భక్తిని ప్రాప్యంగా భావించడం కాకుండా, సాధన రూపంగా భావించి, అనుష్ఠించడం. ఈ విధమైన సాధనభక్తి వివేక విమోకాది అంగాలను కలిగి ఉంటుంది. ఇంతకంటే వేరైనది సాధ్యభక్తి. సాధ్యభక్తి అంటే, సాధ్యుడైన, అంటే, ప్రాప్యుడైన భగవంతుని విషయంలో ఉండే అంతులేని ప్రీతి. ఆ స్వామిని దరిచేరి, స్వరూపానికి అనుగుణమైన సేవను చేసుకుంటే తప్ప నిలువ లేని ఆర్తి. ఆళ్వారులు అందరూ ఇటువంటి సాధ్యభక్తినిష్ఠులు. నమ్మాళ్వారులు తిరువాయ్ మొழి ప్రబంధం ఆరంభంలోనే " మయర్వఱ మదినలమ్ అరుళినన్" (సాధ్యభక్తి రూపంగా పరిణమించిన జ్ఞానాన్ని భగవంతుడు నాకు అనుగ్రహించాడు) అని అన్నారు. ఆళ్వారులకు అందరికీ ఏకైక జ్ఞానపుత్రిక అయిన గోదాదేవి వారికి అందరికీ కల జ్ఞానభక్తులను అంతటినీ తన తండ్రిసొత్తుగా పొందింది. అందువల్ల ఆమె తన ప్రబంధాలలో వ్యక్తం చేసిన భక్తి సాధ్యభక్తియే తప్ప, సాధన భక్తి కాదు–అని మన పూర్వాచార్యుల నిశ్చితమైన అభిప్రాయం. ఆ దృష్టిలోనే ఆ ప్రబంధాన్ని వారు

వ్యాఖ్యానించారు కూడా. ఈ విషయం వారి వ్యాఖ్యానాలను జాగ్రత్తగా గమనించినప్పుడు మనకు బోధపడుతుంది.

అయితే, మహనీయుల వాక్కులు చాలా శక్తి కలిగినవి. "ఋషీణాం పునరాద్యానాం వాచమర్థో ఽ నుధావతి" (మహర్షుల వాక్కులను అర్థాలు అనుసరిస్తాయి) అని మహాకవి భవభూతి అన్నాడు. "వేదశాస్త్రరథారూఢాః జ్ఞానఖడ్గధరా ద్విజాః, క్రీడార్థమపి యద్బ్రూయుః స ధర్మో వేద నేతరః" (శాస్త్రరూపాలైన వేదాలు అనే ప్రదాన్ని రథాన్ని అధిరోహించినవారు, జ్ఞానం అనే ఖడ్గాన్ని ధరించినవారు అయిన ద్విజులు యాదృచ్ఛికంగా మాట్లాడిన మాట కూడా ధర్మం అవుతుంది తప్ప, ఇంకొకటి కాదు) అనేది ఇంకొక సూక్తి. ఈ సూక్తులను అనుసరించి గమనించి చూసినప్పుడు, గోదాదేవి అనుగ్రహించిన తిరుప్పావై ప్రబంధంలో పలు శాస్త్రాలకు సంబంధించిన అర్థాలు గోచరించడంలో ఆశ్చర్యం ఏమీ లేదు. ఈ విషయాన్ని గూర్చి పలువురు విజ్ఞులైన ఆచార్యులు పలు విధాలైన, ఆసక్తికరమైన అంశాలను మనకు తెలియజేశారు, తెలియజేస్తున్నారు కూడా. ఇవి అన్నీ తిరుప్పావై ప్రబంధంలోని ప్రధానమైన అర్థానికి సంబంధించినవి కాకపోయినా, గోదాదేవి వాగ్వైభవాన్ని నిరూపించేవి కనుక, అనుసంధించుకొని ఆనందించడంలో ఏ అడ్డు లేదు. ఈ క్రమంలో ఇప్పుడు, ఈ ప్రబంధంలో నవవిధభక్తి ప్రకారాలు ఏవిధంగా ఆయా ప్రయోగాల ద్వారా సూచింపబడ్డాయో సంగ్రహంగా గమనిద్దాం. శ్రీభాగవతంలోని సప్తమస్కంధంలో ప్రహ్లాదోపాఖ్యానంలో 9 విధాలైన భక్తిప్రకారాలను తెలియజేసే సూక్తి ఉన్నది ఈ సూక్తిని ప్రహ్లాదుడు పలికినట్లుగా భాగవతం తెలుపుతున్నది. ఆ సూక్తి ఏమంటే,

"శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్,

**అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మనివేదనమ్,**

**ఇతి పుంసార్పితా విష్ణౌ భక్తి శ్చేత్ నవలక్షణా"**

భగవంతుని స్వరూపాన్ని, రూపాన్ని, లీలలను, గుణాలను వినడం శ్రవణం అనబడుతుంది. ఆ స్వామి గుణగణాదులను, లీలలను, స్వరూప రూపాలను పొగడడం కీర్తనం అనబడుతుంది. నిరంతరం ఆ భగవంతుని నామాలను తలుస్తూ ఉండడం స్మరణమనబడుతుంది. భగవంతుని పాదాలను సేవించడం, ఆ స్వామికి ఇష్టమైన సేవలను చేయడం పాదసేవనం అనబడుతుంది. ఆ స్వామిని నిత్యం అర్చించడం అర్చన మనబడుతుంది. భక్తిపూర్వకంగా నమస్కారాలను భగవంతునకు చేయడం వందనం అనబడుతుంది. "ఆ స్వామికి నేను దాసుడను" అనే భావంతో సేవించడం దాస్యం అనబడుతుంది. " ఆ స్వామి నాకు స్నేహితుడు" అనే భావనతో వర్తించడం సఖ్యం అనబడుతుంది. "స్వామీ! నీవే నాకు సర్వస్వం, ఈ ఆత్మ మనోవాక్కాయలు ఉన్నవి నీకోసమే " అనే భావనతో తన ఆత్మను పరమాత్మ సన్నిధిలో నివేదించడం ఆత్మ నివేదనం అవుతుంది.

ఈ విధంగా 9 విధాలుగా ఉండే భక్తిప్రకారాలలో, ఒక్కొక్క ప్రకారాన్ని ఆచరించి భగవంతుని అనుగ్రహాన్ని పొందినవారు ఉన్నారు. ఉదాహరణకు, శ్రవణభక్తిని పరీక్షిత్తులోనూ, కీర్తనను శుకమహర్షిలోనూ, స్మరణాన్ని ప్రహ్లాదునిలోను పాదసేవనాన్ని లక్ష్మీదేవిలోనూ, అర్చనాన్ని పృథుమహారాజులోనూ, వందనాన్ని అక్రూరునిలోను, దాస్యాన్ని ఆంజనేయునిలోనూ, సఖ్యాన్ని అర్జునునిలోను ఆత్మనివేదనాన్ని బలిచక్రవర్తిలోనూ గమనించవచ్చునని అంటారు. ఈ విధంగా ఉండే 9 విధాలైన భక్తిప్రకారాలు తిరుప్పావైలో ప్రస్తావించబడిన వైనాన్ని ఇప్పుడు దర్శిద్దాం.

1) శ్రవణమ్– శ్రవణభక్తి తిరుప్పావై ప్రబంధంలోని ఏడవ పాశురంలో "కేశవనై ప్పాడవుమ్ నీ కేట్టే కిడత్తియో?" (కేశవుని పాడినప్పటికీ నీవు వింటూ పరుండి ఉన్నావా?) అనే సూక్తిద్వారా సూచింపబడింది.

2) కీర్తనమ్– తొమ్మిదవ పాశురంలోని " మామాయన్ మాదవన్ గోవిందన్ ఎన్నెన్రు నామమ్ పలవుమ్ నవిన్రు" (ఆశ్చర్యకరమైన లీలలను చేసేవాడు, మాధవుడు, గోవిందుడు అని పలు నామాలను పలికి) అనే ప్రయోగంలో సూచింపబడింది.

3) స్మరణమ్– ఆరవ పాశురంలోని " వెళ్లతరవిల్ తుయిల్ అమర్ న్ద విత్తినై ఉళ్ళత్తుక్కొండు మునివర్గళుమ్ యోగిగళుమ్" (క్షీరాబ్ధిలో ఆదిశేషునిపై నిద్రించే అవతారాలకు మూలపురుషుడైన వ్యూహమూర్తిని మనసులో స్మరించి, మునులు, యోగులు) అనే ప్రయోగంలో ఈ భక్తి ప్రకారం సూచింపబడింది.

4) పాదసేవనమ్– ఈ ప్రకారాన్ని 29వ పాశురంలోని "ఉన్ పొற்றாమరైయే పోற்றுమ్" (నీ బంగారు పాదపద్మాలనే కీర్తించే) అనే ప్రయోగంలో గమనించవచ్చు.

5) అర్చనమ్– దీనిని 5వ పాశురంలోని "తూమలర్ తూవి త్తొழுదు" (పవిత్రమైన పుష్పాలను సమర్పించి, నమస్కరించి) అనే సూక్తిలో గమనించవచ్చు.

6) వందనమ్– ఈ ప్రకారాన్ని " శెన్రు నామ్ శేవిత్తాల్ " (వెళ్లి మనం నమస్కరించినట్లయితే) అనే ఎనిమిదవ పాశురంలోని సూక్తిలో గమనించవచ్చు.

7) దాస్యమ్ – ఈ భక్తిప్రకారాన్ని "ఉనక్కే నామ్ ఆట్చెయ్ వోమ్" (నీకే మేము దాస్యాన్ని చేస్తాము) అనే 29వ పాశురంలోని ప్రయోగంలో చూడవచ్చు.

8) సఖ్యమ్– ఈ విధమైన భక్తిప్రకారం "అన్బినాల్ ఉందన్నై చ్చిఱు పేర్ అழைత్తనవుమ్" (స్నేహం కారణంగా నీ చిన్న పేరును పెట్టి పిలిచినప్పటికీ) అనే 28వ పాశురంలోని ప్రయోగంలో కనబడుతుంది.

9) ఆత్మనివేదనమ్– ఈ భక్తిప్రకారం తిరుప్పావై ప్రబంధంలోని 29వ పాశురంలో ఉండే "ఎంగళై క్కొళ్ళామల్ పోగాదు" (మమ్మలను స్వీకరించకుండా ఉండడానికి సాధ్యం కాదు) అనే ప్రయోగంలో గోచరిస్తుంది.

ఈ విధంగా తిరుప్పావై ప్రబంధంలో 9 విధాలైన భక్తిప్రకారాల సూచన మనకు గోచరిస్తుంది. ఇటువంటి అద్భుతమైన ఎన్నో అంశాలను మనం ఈ ప్రబంధంలో గమనించవచ్చు. ఇటువంటివి అన్నీ పెద్దల ఉపదేశాల వల్ల గ్రహించదగినవి. స్వస్తి.



# తిరుప్పావైలోని సమతావాదం

ఆండాళ్ తల్లి అనుగ్రహించిన తిరుప్పావై ప్రబంధం గోదోపనిషత్ అనే పేరుతో ప్రసిద్ధి చెందింది ఇందులో, ఉపనిషత్తులలో ప్రతిపాదింపబడిన ఒక విధమైన జీవుల సమత తెలియజేయబడినది.

"చేతనులందరూ భగవంతుని విషయంలో దాసభూతులు" అనే సమతను "యస్యాస్మి న తమంతరేమి" (ఏ పరమాత్మకు నేను శేషమై ఉన్నానో, అతనిని విడచి నేను ఉండను) అని మొదలైన ఉపనిషద్వాక్యాలు తెలుపుతున్నాయి. జీవులమైన మనమందరం జ్ఞానస్వరూపులం, జ్ఞానాన్ని గుణంగా కలిగినవారం, భగవంతుడు మనలో అందరిలో అంతర్యామిగా ఉన్నాడు– అనే సమతను మాత్రం తెలిస్తే చాలదు, భగవంతునకు జీవులమైన మనం అందరం దాసులం అనే విషయాన్ని కూడా గుర్తించగలగాలి. ఇదే శేషత్వం. "భగవంతుడు నాకు స్వామి, నేను అతనికి దాసుడను, . ఆ స్వామికి ఆనందాన్ని కలిగించే దాస్యాన్ని నేను చేయాలి, ఇది నా కర్తవ్యం. " అనే భావాన్ని చేతనులందరూ కలిగి ఉండాలి. ఈ విషయాన్ని జీవులు అందరూ అర్థం చేసుకోగలిగితే, జీవులందరిలో సమానంగా ఉండే భగవంతునకు దాసులుగా ఉండడం అనే ధర్మాన్ని మనం అందరం కలిగి ఉన్నాము– అనే విషయాన్ని అర్థం చేసుకోగలిగితే, మనలో ఏ విధమైన వైరుధ్యం, వైషమ్యం కలిగే అవకాశం లేదుకదా.

శ్రీపరాశర భట్టర్ అనే ఆచార్యవర్యులు తిరుప్పావై ప్రబంధానికి తనియన్ శ్లోకాన్ని అనుగ్రహిస్తూ,

"నీళాతుంగస్తనగిరితటసుప్త ముద్బోధ్య కృష్ణం
పారార్థ్యం స్వం శ్రుతిశతశిరఃసిద్ధ మధ్యాపయంతీ"

(నీళాదేవియొక్క ఎత్తైన పర్వతాలవంటి స్తనతటాలపై నిద్రించే శ్రీకృష్ణునకు సుప్రభాతాన్ని పాడి, వందలాది వేదాంతాలలో ప్రతిపాదింపబడిన జీవుల పారతంత్ర్యాన్ని విజ్ఞాపన చేస్తున్నదై) అని అన్నారు.

ఈ విధంగా గోదాదేవి పలు ఉపనిషద్ వాక్యాలలో సిద్ధమైన జీవుల సహజసిద్ధమైన భగవత్ పారతంత్ర్యాన్ని తిరుప్పావై ప్రబంధంలో మనకు ఉపదేశించినది.

దీనికి అనుగుణంగానే తిరుప్పావైలోని మొట్టమొదటి పాశురంలో గోదాదేవి రేపల్లెలో ఉండే గొల్ల కన్యలను అందరినీ

మార్గ**ழி**త్తింగళ్, మది నిఱైంద నన్నాళాల్,
నీరాడ ప్పోదువీర్!, పోదుమినో నేరి**ழை**యీర్!,
శీర్ మల్గుమ్ ఆయ్ ప్పాడి, శెల్వ చ్చిఱుమీర్గాళ్!,
కూర్వేల్ కొడుమ్ తొ**ழி**లన్, నందగోపన్ కుమరన్,
ఏరార్ న్ద కణ్ణి, యశోదై ఇళమ్ శింగమ్,
కార్మేని చ్చెంగణ్, కదిర్ మదియమ్ పోల్ ముగత్తాన్,
నారాయణనే, నమక్కే పఱై తరువాన్,
పారోర్ పుగ**ழ** ప్పడిందేలోర్ ఎమ్ పావాయ్

(అందమైన ఆభరణాలను ధరించినవారై, సంపదతో నిండిన రేపల్లెలో ఉండేవారై, కృష్ణ భక్తిని నిండుగా కలిగిన గోపబాలికలారా! ఆశ్చర్యకరమైన మార్గశీర్ష మాసంలో చంద్రుని కళలతో పూర్ణమైన మంచి దినం అయిన ఈ పౌర్ణమి నాడు ఈ లోకంలో ఉండే జనులంతా పొగడేటట్లుగా ఈ నోములో అవగాహించి చేయడం కోసం ఆశను కలిగినవారైతే, రండి. పదునైన బల్లెంతో క్రూరమైన వ్యాపారాలను చేసేవాడైన నందగోపాలుని కుమారుడు, అందం నిండుగా ఉండే నేత్రాలను కల

యశోదాదేవికి బాల సింహంవంటివాడు, కారుమేఘంవంటి రూపాన్ని కలవాడు, ఎర్రని తామరలవంటి నేత్రాలను కలవాడు, సూర్యచంద్రుల వలే వెలిగే ముఖాన్ని కలవాడు అయిన నారాయణుడే మనకు వ్రతాన్ని చేయటానికి ఆవశ్యకమైన వాద్యాన్ని ఇస్తాడు)

అని శ్రీకృష్ణ భగవానుని సేవించి, దాస్యాన్ని చేయడంకోసం ఆహ్వానించింది.

ఇక్కడ గోదాదేవి రేపల్లెలోని గోపికలను "నీరాడ ప్పోదువీర్!, పోదుమినో!" (మార్గశీర్ష స్నానం చేసే ఆశను కలిగినవారందరూ కూడా రండి!) అని పిలిచింది. ఇక్కడ "నీరాట్టమ్" అనే పదంచేత నిర్దేశింపబడే మార్గశీర్షవ్రత స్నానం ఏమంటే, భగవంతుడైన శ్రీకృష్ణుని దాస్యరసానుభవాన్ని పొందడమే. ఆ స్వామి దర్శనాన్ని పొంది, అతని గుణగణాలను పొగడి, జీవపారతంత్ర్యానుగుణమైన సేవను చేసి ఆనందించడమే.

ఈ విధమైన ఆనందం అనేది ఏకాంతంగా ఒక్కరూ పొందదగినది కాదు, ఇది అందరికీ చేతనులందరికి సమానమైనది. అందరూ దీనిని పొందడానికి అర్హులే. అందుచేత ఈ జీవుల సమతను గుర్తించిన గోదాదేవి దానిని మనకు అందరకు ఉపదేశిస్తూ, ఈ విధంగా తిరుప్పావై ప్రబంధ ప్రారంభంలోనే రేపల్లెలోని గోపికలను అందరిని ఆహ్వానించింది.

ఇక్కడ ఇంకొక విషయాన్ని కూడా మనం గమనించాలి. గోదాదేవి రేపల్లెలో ఉండే చిన్న గొల్లకన్యలను మాత్రమే ఈ వ్రతాన్ని చేయడం కోసం ఆహ్వానించినట్లు మనకు కనుపిస్తుంది. వాస్తవాన్ని గమనిస్తే, జీవులు అందరూ భగవంతుని విషయంలో స్త్రీలవంటివారే, ఆ పరమాత్మకు పత్నీస్థానీయులే. " స ఏవ వాసుదేవో

౽ సౌ సాక్షాత్ పురుష ఉచ్యతే, స్త్రీప్రాయ మితరత్ సర్వం జగద్బ్రహ్మ పురస్సరమ్" (వాసుదేవుడైన భగవంతుడు మాత్రమే వాస్తవంగా పురుషుడు, బ్రహ్మనుండి మిగిలిన జగత్తు అంతా ఆ స్వామి విషయంలో స్త్రీలవలే పరతంత్రులే) , " పుమానేకో వ్యవస్థితః" (నారాయణుడు ఒక్కడే పురుషుడు అనేది వ్యవస్థితమైన విషయం) అని మొదలైన ప్రమాణాలు ఈ విషయాన్ని నిరూపిస్తున్నాయి. అంతేకాక, ఇక్కడ గొల్లకన్నె పిల్లల చిన్నతనం కూడా ఏమి సూచిస్తున్నది? అని అంటే, జీవులు తమను తాము రక్షించుకోలేని స్వభావాన్ని సూచిస్తున్నది. అవబలలైన చిన్న గొల్ల కన్నెపిల్లలు తమను తాము రక్షించుకోలేరు కదా. అందువల్ల ఇక్కడ గోదాదేవి చిన్న కన్య పిల్లలను నిర్దేశించడంద్వారా జీవుల భగవదేకరక్ష్యత్వాన్ని, , భగవంతుని విషయంలో వారు పారతంత్ర్యాన్ని కలిగి ఉండడాన్ని సూచించింది. ఇంతే కాదు, ఇక్కడ ఇంకొక విషయం కూడా ఉన్నది. గొల్లకులానికి సంబంధించిన కన్యలను ఇక్కడ నిర్దేశించడం ఎందుకంటే, గొల్లజాతికి చెందినవారు ఏ విధంగా తమను తాము రక్షించుకోగలిగిన, నిర్వహించుకోగలిగిన జ్ఞానాన్ని, శక్తిని లేనివారుగా చెప్పబడుతున్నారో, ఆ విధంగానే, జీవులందరూ కూడా తమను తాము రక్షించుకోగలిగిన, నిర్వహించుకోగలిగిన జ్ఞానాన్ని శక్తిని లేనివారని సూచించడం కోసమే.

ఇక్కడ గోదాదేవి రేపల్లెలో ఉండే, చిన్న వయస్సులోని గొల్లకన్యలను ఆహ్వానించడం అందరిని ఆహ్వానించినట్లే భావించాలి. ఇది జీవుల సమతను దృష్టిలో పెట్టుకొని చేసిన ఆహ్వానమే. అందువల్ల, ఒక వయస్సులో ఉండేవారినే, ఒక జాతికి చెందినవారినే, ఒక ప్రదేశానికి చెందినవారినే, గోదాదేవి భగవంతుని దాస్యాన్ని చేయడం కోసం ఆహ్వానించింది– అని మనం భావించరాదు. జీవులలో ఉండే సమతను దృష్టిలో పెట్టుకొని అందరినీ ఆహ్వానించినది. వారి స్వరూపానికి

అనుగుణమైన, అందరికీ సమానమైన దాస్యాన్ని చేసి తరించమని ఆహ్వానించినది. "నీరాడ ప్పోదువీర్!, పోదుమినో!" అని అంటూ భగవంతునకు దాస్యాన్ని చేసి, ఆనందించే ఆశను కలవారిని అందరినీ ఆహ్వానించినది. అందరికీ స్వామి అయిన భగవంతుని సేవించడానికి వారి వారి జాతి కాని, లింగం కాని, జ్ఞానం కాని, ఉండే చోటు గాని, ఏవీ ప్రధానం కావు, ఆ స్వామిని సేవించాలనే ఆశ మాత్రమే ముఖ్యమైనది– అని తెలియజేసింది.

ఈ విధంగా ఆహ్వానాన్ని పలకడం ద్వారా గోదాదేవి తిరుప్పావై ప్రబంధంలోని మొదటి పాశురంలోనే ఉపనిషత్తులలో చెప్పబడిన జీవుల సమతను తెలియజేసింది.

★★★★★

# తిరుప్పావై ప్రబంధంలో అలంకారం ఏది?

(మహావిద్వాన్ కాంచీ ప్రతివాది భయంకరం అణ్ణంగరాచార్యస్వామివారి "తిరుప్పావై విశేషార్థం " అనే గ్రంథంనుండి స్వీకరించబడింది)

ఆణ్డాళ్ అనుగ్రహించిన తిరుప్పావైలోని మర్మాన్ని గ్రహించిన పూర్వాచార్యులు "వేదమ్ అనైత్తుక్కుమ్ విత్తాకుమ్ కోదై తమిళ్ ఐయైన్దు మైన్దుమ్ అఱియాద మానిడరై వైయమ్ శుమప్పదుమ్ వమ్బు" (వేదం అంతటికి విత్తు అయిన గోదాదేవి తిరుప్పావై ప్రబంధం ముప్పై పాశురాలను తెలియని మానవులను భూమి భరించడం వ్యర్థం) అని పలికారు. తిరుప్పావై వేదానికి అంతటికి విత్తు (బీజం) అనే ఈ సూక్తి అతిశయోక్తి కాదు. వాస్తవోక్తి. (యథార్థమైన మాట) అందువల్లనే చతుః శాస్త్ర విద్వత్సార్వభౌములైన భగవద్రామానుజులవారు ఈ తిరుప్పావై ప్రబంధంలోనే చాలా ఆదరాన్ని కల్గి, "తిరుప్పావై జీయర్" అనే పేరును పొందారు. తిరుప్పావైకు గొప్పతనం మార్గశీర్షమాసంలో మాత్రమే కాదు, కోవెలలోను, తిరుమాళిగలలోను ప్రతిదినం జరిగే తిరువారాధన తిరుప్పావై సేవాకాలాన్ని తిరుప్పావై శాత్తుముఱైను ప్రధానంగా కల్గినదై, అంతటా ఒకేవిధంగా ప్రకాశిస్తున్నది. ఆళ్వార్ల, ఆచార్యుల తిరునక్షత్రాల ఉత్సవాలలోకూడ తిరుప్పావై ప్రబంధశాత్తుముఱైయే ముందు ముందుగా చేయబడుతున్నది. ఇది శ్రీరామానుజార్యదివ్యాజ్ఞగానే కదా ఆనాటి నుండి ఈనాటివరకు అంతటా అవ్యాహతంగా ప్రవర్తిస్తున్నది. ఈనాటివరకు అనే మాట ఎందుకు? సూర్యచంద్రులున్నంతవరకు ఈ క్రమం మాఱదు.

తిరుప్పావైకు ఇటువంటి గొప్పతనం కల్గడానికి కారణం –సకలార్థాలు ఇందులో నిండుగా ఉన్నందువల్లనే. ఈ ప్రబంధానికి ఆయిరప్పడి, ఈరాయిరప్పడి,

మూవాయిరప్పడి, నాలాయిరప్పడి, ఐయాయిరప్పడి, ఆఱాయిరప్పడి అని ఈ రీతిలో పలు వ్యాఖ్యానాలు అనుగ్రహించిన పూర్వాచార్యులు కూడా వాచ్యార్థాలను రసఘనంగా వ్యక్తం చేశారే తప్ప, అంతరార్థాలని, వ్యంగార్థాలని, ధ్వన్యర్థాలని గొప్పగా వ్యవహరింపబడే స్వాపదేశార్థాలను వ్యక్తం చేయలేదు. అవి ఉపదేశగమ్యాలు అని, వారి వారి బుద్ధిచమత్కారానికి తగినట్లుగా నానావిధాలు ఊహించదగినవి అనే అభిప్రాయంతోనే వారు స్వాపదేశార్థాలను వ్యక్తపఱచలేదు.

కొందఱు, స్వాపదేశార్థమని వివరించడం గోదాదేవి అభిప్రాయానికి అనుగుణం కాదని, పాశురాలలో స్పష్టంగా లభించే అర్థాలకు మించి ఇంకా కొన్ని అర్థాలను వ్యంగ్యార్థాలని అంటూ వివరించడం తగదు అని, అది వ్యర్థ ప్రయత్నమని అంటున్నారు. గోదాదేవి పైపైన వ్యక్తమయే అర్థాలలో పూర్ణమైన దృష్టిని కల్గి ఉండకుండా, అంతరార్థాలలో దృష్టిని కల్గి ఉన్నదనే విషయాన్ని ప్రామాణికులు అంగీకరించే రీతిలో వివరిస్తున్నాను. గమనించండి. తిరుప్పావై మొదటి పాశురంలో "నీరాడ ప్పోదువీర్ పోదుమినో!" అని అంటూ "స్నానం చేయడం కోసం వచ్చేవారు అందఱు రండి" – అని ఆహ్వానించి, నాల్గవ పాశురంలో మేఘాన్ని సంబోధించి, "నాఙ్గళుమ్ మార్గழி నీరాడ ఉలకినిల్ పెయ్ దిడాయ్" (మేము కూడా మార్గశీర్షవ్రత స్నానాన్ని చేసేటట్లు లోకంలో వర్షించు) అని వర్షాన్ని కురవమని నియమించారు. వీటిని చూచినపుడు స్నానం చేయడానికే గోదాదేవి (లేక, గోపికలు) బయలుదేరు తున్నట్లు, స్నానం చేయడం కోసమే చెలికత్తెలను ఆహ్వానిస్తున్నట్లును, స్నానం చేయడానికి కావలసిన తీర్థసమృద్ధిని కల్గడంకోసమే వర్షాన్ని కురవమని మేఘదేవతను నియమిస్తున్నట్లును తెలుస్తున్నది. ఇదే వాస్తవమైన అర్థం అయితే, వీరంతా కలిసి ఓ చెఱువుతీరానికి వెళ్ళి ఉండాలి. స్నానం చేసే చోటు తటాకమే

కదా! వీరు ఏ చెఱువు తీరానికి వెళ్ళినట్లుగా తిరుప్పావైలో ఏ పాశురంలోను లేదు. శ్రీనందగోపాలుని భవనానికి చేరి, అక్కడ "నప్పిన్నైకొజ్ఞైమేల్ వైత్తు క్కిడన్ద మలర్మార్బన్" (నప్పిన్నై వక్షస్సుపై పరుండి, వికసించిన వక్షాన్ని కలవాడు) అయిన శ్రీకృష్ణుని ప్రబోధించి, నీళాదేవిని (నప్పిన్నైను మేల్కొలుపి వారిని స్తుతించి, "బ్రాహ్మముహూర్తంలో మేము నిద్రలేచి ఇక్కడకు రావడం ఎందుకోసం?– అంటే, "ఉన్దన్నోడుற்றோமే యావోమ్, ఉనక్కే నామ్ ఆట్చెయ్ వోమ్" (నీతో సంబంధాన్ని కలవారమే కాగలము, నీకే కైంకర్యాన్ని చేస్తాము అని విన్నపించడంకోసమే అని వ్రతసమాప్తిని చేశారు. ఈవిధంగా దివ్యదంపతులవద్దకు పోయి సేవించడమే వీరు పరిగ్రహించిన "నీరాట్టమ్" (ధనుర్మాసవ్రతం) అని స్పష్టంగా తెలుస్తున్నది.

అందువల్ల "నీరాడ ప్పోదువీర్" (స్నానం చేయరండి) , "నాజ్గళుమ్ మార్గழி నీరాడ" (మేముకూడా మార్గశీర్ష స్నానం చేసేటట్లు) , "కుళ్ళక్కుళిర క్కుడైన్దు నీరాడాదే" (చల్లగా అవగాహించి, స్నానం చేయకుండా) , "ఉక్కముమ్ తట్టొళియుమ్ తన్దున్ మణాళనై ఇప్పోదే ఎమ్మై నీరాట్టు" (అద్దాన్ని, విసనకర్రను ఇచ్చి, నీమగని, మమ్ములనే ఇపుడు స్నానం చేయించు) , "మాలే! మణివణ్ణా! మార్గ నీరాడువాన్" (ఆశ్రితవ్యామోహాన్ని కలవాడా! మణివర్ణా! మార్గశీర్షస్నానం కోసం) అనే పాశురాలలో ప్రస్తావింపబడిన నీరాట్టమ్ చన్నీటిలో మునగడం కాదు అని, భగవత్సంశ్లేషాన్ని, భాగవతసంశ్లేషాన్ని, ఆచార్యకులావగాహాన్ని మాత్రమే నీరాట్టమని అన్నారని నిష్కర్షించడంలో ఔచిత్యం ఉన్నది.

దీనిని మూవాయిరప్పడి వ్యాఖ్యలో పెరియ వాచ్చాన్పిళ్ళై, ఆఱాయిరప్పడి వ్యాఖ్యలో అழకియ మణవాళ ప్పెరుమాళ్ నాయనార్ కూడ స్పష్టంగా

వివరించారు. "నీరాడ ప్పోదువీర్" అనే సందర్భంలో పెరియవచ్చాన్పిళ్ళై శ్రీసూక్తి ఈవిధంగా ఉన్నది. " (నీరాడ) – ఇత్తాల్ ఇవరకళ్ నినైక్కిఱదు కృష్ణసంశ్లేషమ్. తమిழరుమ్ కలవియై "చ్చునైయాడల్" ఎన్బార్గళ్. . . "ఏష బ్రహ్మ ప్రవిష్టోస్మి గ్రీష్మే శీతమివ హ్రదమ్" ఎన్ఱు భగవత్సంశ్లేషత్తుక్కు గ్రీష్మకాలత్తిలే కుళిర్ న్ద మడువిల్ పడువదై దృష్టాంతమాక చ్చొల్లిற்றிతే" (నీరాడ– ఈపదం ద్వారా వీరు ఉద్దేశించినది కృష్ణసంశ్లేషం. ద్రావిడులు కూడా సంశ్లేషాన్ని "శునైయాడల్" అని అన్నారు. "ఏష బ్రహ్మ ప్రవిష్టోస్మి గ్రీష్మే శీతమివ హ్రదమ్"– గ్రీష్మకాలంలో చల్లని మడుగులో వలె, ఈ పరబ్రహ్మలో నేను అవగాహిస్తున్నాను అని అంటూ భగవత్సంశ్లేషానికి గ్రీష్మకాలంలో చల్లని మడుగులో స్నానమాడడం దృష్టాంతంగా తెలుపబడింది కదా!)

ఆఱాయిరప్పడి శ్రీసూక్తి ఈవిధంగా ఉన్నది. " (నీరాడ) – ఇవర్ తజ్గళుక్కు నీరాడ ఎన్ఱు నోయాశైయితే. యమునాజలమ్ ఒరుత్తియుడైయ విరహాగ్నియాలే శువడుమే. తమిழర్ కలవియై చ్చునైయాడల్ ఎన్బాయ్ற்று చ్చొల్లువతు. కృష్ణసంశ్లేషత్తై యాయిற்று ఇవర్ కళ్ "నీరాడ"– ఎన్గిఱదు. "ఏష బ్రహ్మ ప్రవిష్టోస్మి గ్రీష్మే శీత మివ హ్రదమ్" ఎన్ఱుమాపోలే" (నీరాడ – వీరికి అవగాహించాలని పేరాశ కదా! యమునాజలం ఒక గోపిక యొక్క విరహాన్ని చేత సలసల కాగుతుంది కదా! తమిళులు సంశ్లేషాన్ని "శునైయాడల్" అని అన్నారు. శ్రీకృష్ణసంశ్లేషాన్ని వీరు "నీరాడ" అని అన్నారు, "ఏష బ్రహ్మ ప్రవిష్టోస్మి గ్రీష్మే శీతమిహ్రదమ్" వలె) –దీనినిబట్టి లోపల ఉండే అర్థం వేఱొకటి అని, బయటకు చెప్పే మాట ఇంకొకటి అని నిర్ణయింపబడుతున్నది.

"నీరాడ" అనే ఒక పదం విషయంలో మాత్రమే కాదు– ఇది (ఈ క్రమం) . ఇంచుమించుగా అన్ని పదాలు అంతరంగమైన వేరొక అర్థాన్ని ఉద్దేశించే ప్రయోగింపబడినవి – అని తెలియవచ్చు. అలంకారశాస్త్రంలో రూపకాతిశయోక్తి అనే ఒక అలంకారమున్నది. "పశ్య! నీలోత్పలద్వంద్వాత్ నిస్సరంతి సితా శ్శరాః" అని దానికి ఉదాహరణం చూపబడింది. "రెండు నల్ల కలువపూలనుండి పదునైన బాణాలు వెలువడుతున్నాయి, చూడు" అని ఇందులోని అర్థం. ఇక్కడ నల్లకలువ పూవు వివక్షితం కాదు; బాణాలు కూడా వివక్షితాలు కావు. నాయకి కన్నులనుండి వెలువడే కటాక్షపాతాలను తెలుపగోరి ఈవిధంగా చెప్పబడింది. దీనిని తమిళులు "ఉరువక వుయరు నవిల్చియణి" అని అంటారు. తిరుప్పావై అంతా ఈ అలంకారవైఖరిలోనే రచింపబడింది– అని నా అభిప్రాయం.

ఇది కాకుండా, వేఱే మూడు అలంకారాలు కూడా అలంకారశాస్త్రంలో ఉన్నాయి. అవి, అప్రస్తుతప్రశంస, ప్రస్తుతాంకురం, సమాసోక్తి– అనేవి. "అప్రస్తుతప్రశంసా స్యాత్ సా యత్ర ప్రస్తుతాశ్రయా" (అప్రస్తుతమైన విషయ ప్రస్తావన ప్రస్తుత విషయంలో పర్యవసిస్తే అది అప్రస్తుత ప్రశంసాలంకారం) అనేది అప్రస్తుత ప్రశంసాలంకార లక్షణం. ప్రస్తుతమైన (ప్రకృతసందర్భానికి చెందిన) ఒక విషయం తెలుపడంకోసం అప్రస్తుతమైన ఒక విషయాన్ని ప్రస్తావించడం అప్రస్తుత ప్రశంస – అనబడుతుంది. ఈ అలంకారరీతిలో కూడా కొన్ని పాశురాలున్నాయి. చెప్పవచ్చు. "ప్రస్తుతేన ప్రస్తుతస్య ద్యోతనే ప్రస్తుతాంకురః" (ప్రస్తుతంలో ప్రస్తుతార్థం స్ఫురించడం ప్రస్తుతాంకురం) అనేది ప్రస్తుతాంకురాలంకార లక్షణం. స్పష్టంగా చెప్పబడే అర్థం ప్రకృతమై, వ్యంగ్యంగా భాసించే అర్థంకూడా ప్రకృతమైతే, అక్కడ ప్రస్తుతాంకురాలంకారం ఉన్నదని చెప్పబడుతుంది. ఈ అలంకారవైఖరిలో

తిరుప్పావై అమరి ఉన్నది – అని భావించడంకూడా తగినదే. నిజానికి, తిరుప్పావై లోని క్రమం ఇటువంటిదే. –

"సమాసోక్తిః పరిస్ఫూర్తి: ప్రస్తుతేఽప్రస్తుతస్య చేత్" (ప్రస్తుత విషయంవల్ల అప్రస్తుత విషయం స్ఫురిస్తే అది సమాసోక్తి. ) అనేది సమాసోక్తి లక్షణం. ప్రస్తుతమైన ఒక విషయాన్ని వర్ణించే సందర్భంలో అప్రస్తుతాలైన కొన్ని అర్థాలు స్ఫురించి నట్లయితే అక్కడ సమాసోక్తి చెప్పబడుతుంది. తిరుప్పావైలో ఈ అలంకారం ఉన్నదని భావించే ప్రసక్తి లేనేలేదు. ఎందుకు? అంటే, ఇందులో స్వాపదేశార్థాలు ముఖ్యమైనవి– అని మన అభిప్రాయం కనుక, ఈ అలంకారానికి ఇందులో చోటు లేదు. కొందఱి అభిప్రాయానుసారం అయితే, ఈ అలంకారం కూడా ఇందులో భావించదగును. ఏవిధంగా అయినా వాచ్యార్థానికి మించిన వ్యంగ్యార్థం ఇందులో విశేషంగా ఉన్నది– అనే విషయమే స్ఫుటమవుతుంది.

తిరుప్పావైలోని ఏడవ పాశురంలో 'కలన్దు పేశిన పేచ్చరవమ్ కేట్టిలైయో పేయ్ ప్పెణ్ణే!" (ఓ పిచ్చిపిల్లా! కలసి పల్కిన మాటలోని ధ్వనిని నీవు వినలేదా?) అని చెప్పబడుతున్నది. "పేశిన పేచ్చరవమ్ కేట్టిలైయో?" అని అంటే చాలు. "నేను చెప్పే మాటను విను" అని, "నేను చెప్పే మాట నీ చెవిలో పడలేదా?" అని ఈ విధంగాకదా లోకవ్యవహారం ఉన్నది. ఈ రీతిలో "పేశిన పేచ్చు కేట్టిలైయో?" అని అనడం చాలి ఉండగా, "పేచ్చు అరవమ్ కేట్టిలైయో?" అనే ప్రయోగం విశేషమైన అర్థాన్ని కల్గినది. మాటను వినడంలో రసం లేదు. మాటవల్ల స్ఫురించే

ధ్వన్యర్థాన్ని విని తెలిసికోవడమే మిక్కిలి భోగ్యమైనది అని గోదాదేవి ఈ విధంగా సూచించింది.



# తిరుప్పావై – శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రమ్

తిరుప్పావైప్రబంధంలో గోదాదేవి ప్రతిపాశురంలోను భగవంతుని కొన్ని నామాలను కీర్తించింది. మొదటి పాశురంలో నారాయణ నామానుసంధానాన్ని చేసినది.

మొదటి పాశురంలో అనుసంబింపబడిన నారాయణనామాన్ని తరువాతి పాశురాలలో అనుసంబధింపబడిన భగవాన్నామాలతో సమానాధికరణప్రక్రియలో అన్వయించి, మిగిలిన నామాలన్నీ నారాయణశబ్దార్థాన్ని వివరించేవిగా అర్థం చెప్పడంలోకూడా చాలా స్వారస్యం ఉన్నది – అని శ్రీమాన్ వేళుక్కుడి వరదాచార్య స్వామివారి సూక్తి. అంటే, నారాయణుడే పరమశబ్దవాచ్యుడు, నారాయణుడే ఉత్తముడు, నారాయణుడే పద్మనాభుడు, నారాయణుడే మామాయన్, నారాయణుడే దామోదరుడు, నారాయణుడే మాధవుడు, నారాయణుడే కేశవుడు, నారాయణుడే తిరుమాల్ – అని ఈ విధంగా సమానాధికరణక్రమంలో అన్వయించి, యథోచితంగా అర్థాన్ని గ్రహించవచ్చు.

ఉదాహరణకు–

1) నారాయణుడే పరముడు. " పరో మా యస్మాత్ సః పరమః" అని పరమశబ్ద వ్యుత్పత్తి. నారాయణని కంటే ఉత్కృష్టమైనవాడు ఇంకొకడు లేడు – అని అర్థం. "నారాయణుడే సర్వస్మాత్పరుడు" అని తాత్పర్యం.

2) నారాయణయుడే దామోదరుడు. నారాయణ శబ్దం భగవంతుని పరత్వాన్ని చెబుతుంది. దామోదరశబ్దం అతని సౌలభ్యాన్ని చెబుతుంది. ఈ రెండిటిద్వారా లభించిన అర్థం – పరత్వ సౌలభ్యాలకు అవధి నారాయణుడే – అని.

3) నారాయణుడే మగన్. నారాయణశబ్దం, అతడు జగత్తుకు కారణం – అనే అర్థాన్ని తెలియజేస్తుంది. నారశబ్దం జగత్తు నరజాతం అని చెబుతుంది. అందువల్ల తెలిసినది ఏమంటే, నరుడైన భగవంతుడు జగత్కారణం – అని. ఇందువల్ల,

నారాయణ పదంద్వారా భగవంతుని జగత్కారణత్వం వ్యక్తం అవుతున్నది. అతడే "మగన్" అని అనడం విచిత్రమైనది. " పితా పుత్రేణ యోనిమాన్ యోనియోనౌ" (లోకానికి అంతటికి తండ్రి అయిన భగవంతుడు ఈ లోకంలో తనకు పుత్రునివంటివాడైన ఒకరనిని తండ్రిగా చేసుకుని అవతరిస్తున్నాడు) అనే వేదవాక్యార్థం ఇక్కడ వ్యక్తమవుతున్నది. జగతుకు అంతటికి తండ్రి అయిన భగవంతుడు తన పుత్రాదులలో ఒకనిని తనకు తండ్రిగా అనుమతించి, జన్మిస్తున్నాడు. ఇదే కదా, భగవంతుడు అవతరించి పొందిన ఐశ్వర్యం. జన్మించి శ్రేయస్సును పొందినవాడు అతడు ఒక్కడేకదా. " స ఉ శ్రేయాన్ భవతి జాయమానః" అను శ్రుతి ఈ విషయాన్ని చెప్పింది.

4) నారాయణుడే తిరుమాల్. అతడు బ్రహ్మచారినారాయణుడు కాదు, శ్రీమన్నారాయణుడు – అని తాత్పర్యం. ఇందువల్ల దేవతాంతరవ్యావృత్తి సిద్ధిస్తుంది. ఇతడు పరముడుగా, మిగిలినవారు అవరదేవతలుగా ఉండడానికి కారణం ఇదే. మిగిలినవారికి రమాసంబంధం లేదుకదా. ఇతడే శ్రియఃపతి– అని తాత్పర్యం.

ఈ విధంగా నారాయణనామంతో మిగిలిన నామాలను అన్వయించి, సరసంగా అర్థాన్ని గ్రహించవచ్చు.

శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రంలో వేయి నామాలు ఉన్నాయి. వాటిలో, మొట్టమొదటి నామం విశ్వం అనే నామం. ఈ మొదటి నామాన్ని మిగిలిన నామాలు అన్నీ వివరిస్తున్నాయి –అని పరాశర భట్టర్ వారు తమ భగవద్గుణదర్పణం అనే శ్రీవిష్ణుసహస్రనామస్తోత్ర వ్యాఖ్యానంలో అనుగ్రహించారు. ఇదే విధంగా, తిరుప్పావై ప్రబంధంలో మొదటి పాశురంలో ప్రస్తావింపబడిన నారాయణనామాన్ని మిగిలిన పాశురాలలో అనుసంధింపబడిన నామాలు వివరిస్తున్నాయి– అని భావించినప్పుడు, ఈ ప్రబంధానికి శ్రీ విష్ణుసహస్రనామస్తోత్రసామ్యం స్ఫుటం అవుతున్నదికదా.

★★★★★

# తిరుప్పావై – శ్రీపాంచరాత్రమ్ –1

"నమ స్సకలకళ్యాణదాయినే చక్రపాణయే,
విషయార్ణవమగ్నానాం సముద్ధరణహేతవే"

పాంచరాత్రశాస్త్రం ఒక మహాసముద్రం. దానిలో దిగి ఈదడం అనేది సామాన్యులకు సాధ్యం కాని. పని. అంతేకాక, పాంచరాత్ర శాస్త్రంలో చెప్పిన విషయాలను తిరుప్పావై ప్రబంధంలో గమనించి తెలియజేయడం అనేది ఇంకా సాధ్యం కాని పని. "ములై ఎழுన్దార్ పడి మోవా ఎழுన్దార్ క్కు త్తెరియాదిఱే (స్తనోద్భేదం ఏర్పడిన స్త్రీల స్వభావాన్ని తెలియడం మీసాలు మొలిచిన మగవారికి సాధ్యం కాదు కదా) అని తిరుప్పావై ప్రబంధాన్నిగూర్చి పరాశరభట్టర్ అన్నారని ప్రసిద్ధి. అయినప్పటికీ కరుణాస్వరూపిణి అయిన గోదాదేవి అనుగ్రహాన్ని ఆధారంగా చేసుకుని కొన్ని విషయాలను ఇక్కడ ప్రస్తావన చేయడం జరుగుతున్నది. " ఉద్బోధ్య కృష్ణం శ్రుతిశతశిరఃసిద్ధ మధ్యాపయంతీ" అని భట్టర్ చెప్పిన విధంగా, తిరుప్పావై ప్రబంధంలో గోదాదేవి వేదాంతార్థాలను భగవంతునికే తెలియజేసింది కదా. శ్రీకృష్ణ పరమాత్మ సన్నిధిలో" ఈ జీవాత్మలు నీ సొత్తు, వీరిని నీవు స్వీకరించాలి" అనే వేదాంతసిద్ధమైన అర్థాన్ని విజ్ఞాపన చేసింది. మనలను ఉద్దేశించి, మనకందరకు ఆ స్వామిని ఆశ్రయించడం కర్తవ్యం అని ఉపదేశించింది. ఈ విధంగా భగవంతునకు, చేతనులకు ఉపదేశరూపంగా ఉండేది ఈ తిరుప్పావై ప్రబంధవిశేషం. .

ఈ తిరుప్పావై ప్రబంధం "వేదమ్ అనైత్తుక్కుమ్ విత్తు కోదై తమిழ் " అని మన పూర్వాచార్యులు పలికినట్లుగా, వేదానికి అంతటికి బీజంవంటిది అని ప్రసిద్ధి చెందినది. వేదార్థం అంతా దేనిలో పర్యవసించింది? అంటే, పాంచరాత్రశాస్త్రంలో పర్యవసిస్తున్నది. దీనికి ఏకాయనం అని పేరు. మోక్ష సాధనకు దీనికంటే వేరొక మార్గం ఇంకొకటి లేదు. ఈ విషయం " ఏష ఏకాయనో వేదః ప్రఖ్యాతః సాత్వతో విధిః, దుర్విజ్ఞేయః దుష్కరశ్చ ప్రతిబుద్ధైః నిషేవ్యతే, మోక్షాయనాయ వై పంథాః

ఏతదన్యో న విద్యతే, తస్మాత్ ఏకాయనం నామ ప్రవదంతి మనీషిణః" అని అంటూ పారమేశ్వర సంహిత చెప్పిన వచనాలవల్ల తెలుస్తుంది. ఇక్కడ మోక్షాయనం అంటే, మోక్షసాధనకు ఉపాయం అని అర్థం. అయనం అంటే, ఉపాయం అని అర్థం. ఇందువల్ల, పాంచరాత్రవిధిని విడచి వేరొక ఉపాయం మోక్షసాధనకు లేదు అని పై సంహితావచనాలు తెలుపుతున్నాయి. భగవద్రామానుజులకు ముందున్న శ్రీమద్యామునుల మొదలైన పూర్వాచార్యులు కానీ, శ్రీరామానుజులు కానీ, వారికి పిమ్మట అవతరించిన శ్రీవేదాంతదేశికులు, శ్రీవరవరమునులు కానీ, వీరందరూ సిద్ధాంతస్థాపనను చేయడంలో వేదాంతాలను, దివ్యసూరుల సూక్తులను ప్రమాణంగా గ్రహించినట్లే, శ్రీపాంచరాత్ర సూక్తులను కూడా పరమ ప్రమాణంగా గ్రహించారు. ఆ శాస్త్రసూక్తులను ఉదాహరిస్తూ గ్రంథాలను రచించారు. ఈ విషయాన్ని శ్రీయామునుల ఆగమప్రామాణ్యాన్నిబట్టి, శ్రీరామానుజుల శ్రీభాష్యాన్నిబట్టి, వేదాంతదేశికుల పాంచరాత్రరక్షనుబట్టి, శ్రీవరవరమునుల శ్రీవచనభూషణ జ్ఞానసారాది దివ్యగ్రంథాల వ్యాఖ్యానాలనుబట్టి తెలియవచ్చు. ఇంకేకాక, శ్రీరామానుజులు నిత్యగ్రంథాన్ని పూర్తిగా పాంచరాత్రక్రమాన్ని అనుసరించి, అనుగ్రహించిన రీతినికూడా చూడవచ్చు. శ్రీ వేదాంతదేశికులు కూడా తమ రహస్యగ్రంథాలలో అనేకసందర్భాలలో పాంచరాత్ర ప్రమాణాలను ఉట్టంకించి, సిద్ధాంత విషయశోధనను, నిర్ణయాన్ని చేశారు. అందువల్ల, "మోక్షాయనాయ వై పంథాః ఏతదన్యో న విద్యతే " అనే సూక్తి సార్ధకమైనది. అందువల్ల శ్రీపాంచరాత్రానికి ఏకాయన శాఖ అనే పేరు ఏర్పడింది.

ఈ ఏకాయనాన్నిగూర్చి ఉపనిషత్తులలో ప్రస్తావన ఉన్నది. ఛాందోగ్యోపనిషత్తులోని భూమవిద్యాప్రకరణంలో నారదుడు సనత్కుమారునితో పలికే సందర్భంలో గోచరించే ఏకాయనపదం శతపథబ్రాహ్మణంలోని పంచరాత్రపదం మొదలైనవి ఈ శాస్త్రప్రాచీనతను నిరూపిస్తున్నాయి అని విమర్శకుల అభిప్రాయం.

ఈ విధంగా 'ఏకాయనమ్ అనబడే ఈ పాంచరాత్రం శాస్త్రచోదితమైన భగవంతుని పొందడానికి తగిన ఉపాయం. భగవంతుడు బాహ్యేంద్రియాలకు గోచరం కాడు, కేవలం శాస్త్రంద్వారానే తెలుసుకోవడానికి సాధ్యమయ్యేవాడుకదా. భగవంతుడు శాస్త్రయోని అని అందువల్లనే చెప్పబడుతున్నాడు. ఆ విధంగా ప్రథమశాస్త్రమైన వేదం మనకు ఉపదేశించిన మోక్షమార్గం ఈ పాంచరాత్రం. (మిగిలిన శాస్త్రాలు మోక్షమార్గాలు కావు అని ఇక్కడ అర్థం కాదు. న హి నిందా న్యాయంలో స్వీకరించి, ఈ శాస్త్రవైభవాన్ని తెలియజేయడమే ఇక్కడ తాత్పర్యమని గ్రహించాలి) . శ్రీమన్నారాయణుని పరతత్వంగా తెలియజేసే శాస్త్రం కనుక, ఈ పాంచరాత్ర శాస్త్రం పూర్తిగా ప్రమాణం.

శ్రీదేశికులు "పోయ పిழையుమ్ పుకుదరువా నిన్ఱనవుమ్ తియినిల్ తూశాగుమ్– ఎన్ఱు ఉపనిషత్తిలే కండుకొళ్వదు" అని తిరుప్పావై ప్రబంధాన్ని ఉపనిషత్ శబ్దంతో నిర్దేశించారు. ఈ విధంగా ఈ తిరుప్పావై ప్రబంధం గోదోపనిషత్ అనే పేరుతో ప్రసిద్ధి చెందినది. వేదాలను అన్నిటినీ నమ్మాళ్వారులు ద్రావిడీకరించినట్లుగానే గోదాదేవి ఉపనిషత్తులను ఈ ప్రబంధరూపంగా ద్రావిడీకరించింది. ఈ తిరుప్పావైను దృష్టిలో పెట్టుకొనే శ్రీరామానుజులు శ్రీభాష్యాన్ని 156 అధికరణాలుగా వర్గీకరించాలని పెద్దలు అంటారు. ($1\times5\times6=30.$)

ఇప్పుడు తిరుప్పావై ప్రబంధంలో గోచరించే పాంచరాత్రశాస్త్ర ప్రతిపాదితాలైన కొన్ని అంశాలను గమనిద్దాం

1) అర్థపంచక ప్రస్తావన

పాంచరాత్రాగమానికి చెందిన హారీతసంహిత –

"ప్రాప్యస్య బ్రహ్మణో రూపం ప్రాప్తుశ్చ ప్రత్యగాత్మనః,
ప్రాప్త్యుపాయం ఫలం ప్రాప్తేః తథా ప్రాప్తివిరోధి చ,

వదంతి సకలా వేదాః సేతిహాసపురాణకాః,

మునయశ్చ మహాత్మానో వేదవేదాంతపారగాః"

(జీవునిచే పొందబడేవాడైన భగవంతుని స్వరూపం, ఆ పరమాత్మను పొందే జీవుని స్వరూపం, భగవంతుని పొందడానికి తగిన ఉపాయం, భగవంతుని పొందినందువల్ల కలిగే ప్రయోజనం, ఆ ఫలాన్ని పొందడంలో ఎదురయ్యే విరోధులు – అనే ఈ ఐదు విషయాలను అన్ని ఇతిహాసపురాణాలతో కూడుకొని ఉండే వేదాలు, వేదవేదాంతాల అవధిని దర్శించినవారైన, మహానుభావులైన మునులు పలుకుతున్నారు) అని తెలుపుతున్నది.

శాస్త్రమనేది పై అయిదు విషయాలను నిరూపిస్తుంది అనేది పై ప్రమాణం తెలుపుతున్నదికదా. ఈ ఐదు అర్థాలకే అర్థపంచకం అని పేరు.

ఈ ప్రమాణం తెలిపిన అర్థపంచకాన్ని తిరుప్పావైప్రబంధం నిరూపిస్తున్నది. పరస్వరూపాన్ని "నారాయణనే నమక్కే పఱై తరువాన్", " నాற்ற త్తుழாయ్ ముడి నారాయణన్", "నారాయణన్ మూర్తి కేశవనై", "గోవిందా ఉందన్నోడు ఉఱవేల్ నమక్కు ఇంగు ఒழிక్క ఒழிయాదు" అని ఈ విధంగా పలుచోట్ల నిరూపించింది. నారాయణశబ్దాన్ని, నారాయణశబ్దంద్వారా తెలుపబడే కల్యాణగుణాలను తెలిపే పలు నామాలను పఠించడంద్వారా పరస్వరూపాన్ని నిరూపించింది.

జీవస్వరూపాన్ని "శెల్వ చ్చిఱుమీర్గాళ్, పేయ్ ప్పెణ్ణే, నాయక ప్పెణ్ పిళ్ళాయ్, ఎల్లే ఇళంకిళియే" అన్ని మొదలైన సంబోధనలలో నిరూపించింది.

ప్రాప్తికి తగిన ఉపాయాన్ని "పాడి ప్పఱై కొండు, ఉన్ పొற்றாమరై అడియే పోற்றుమ్ పొరుళ్ కేళాయ్" అని మొదలైన సూక్తులలో తెలిపింది.

ప్రాప్తిఫలాన్ని " ఉందన్నోడు உற்றோமே యావోమ్, ఉనక్కే నామ్ ఆట్చెయ్ వోమ్, మற்றை నమ్ కామంగళ్ మాற்று" అనే సూక్తుల ద్వారా తెలుపబడింది.

ఇక, ఐదవది అయిన ప్రాప్తివిరోధి "మற்றை నమ్ కామంగళ్ మాற்று" అనే సూక్తి ద్వారా తెలుపబడింది.

ఈ విధంగా తిరుప్పావై ప్రబంధం పాంచరాత్రశాస్త్రంలో చెప్పబడిన విధంగా అర్థపంచకప్రతిపాదకం అనే విషయాన్ని సంగ్రహంగా గమనించవచ్చు.

2) ఏకాయననామప్రస్తావన

అంతే కాదు, ఈ తిరుప్పావైప్రబంధం ఆశ్చర్యకరంగా ఏకాయనశాస్త్రనామనిర్దేశంతో ప్రారంభం అవుతున్నది. ఈ ప్రబంధంలోని మొదటి పాశురం "మార్గழிత్తింగళ్" అని "మార్గழி" శబ్దోచ్చారణతో ప్రారంభం అవుతున్నది. "మార్గழி" అనే ద్రావిడ పదానికి మూలం మార్గశీర్షం అనే సంస్కృతపదం. మార్గశీర్ష శబ్దానికి –మార్గాలలో, ఉపాయాలలో, శీర్షం, అంటే, ప్రధానమైనది– అని అర్థం. శాస్త్రాలలో భగవంతుని పొందడానికి చెప్పబడిన ఉపాయాలలో ప్రధానమైన ఉపాయం శరణాగతి. "తద్వశీకరణం తచ్ఛరణాగతిరేవ" అని భగవద్రామానుజుల శ్రీభాష్యసూక్తి. అటువంటి గొప్పదైన శరణాగతి అనే ఉపాయాన్ని తెలియజేసే శాస్త్రమే "ఏష ఏకాయనో వేదః"అని, "మోక్షాయనాయ వై పంథాః ఏతదన్యో న విద్యతే" అని ఏకాయనశబ్దంతో కీర్తింపబడే పాంచరాత్రశాస్త్రం. ఈ ఏకాయనశబ్దానికి పర్యాయమే మార్గశీర్షశబ్దం. ఆ మార్గశీర్షశబ్దానికి ప్రతిరూపమైన "మార్గழி" అనే శబ్దనిర్దేశంతో ఈ ప్రబంధం ప్రారంభమవుతున్నది.



# తిరుప్పావై – శ్రీపాంచరాత్రమ్ –2

శెల్వ చ్చిఱుమీర్ కాళ్

గోదాదేవి మార్గశీర్ష వ్రతాన్ని ఆచరించడం కోసం రేపల్లెలో ఉండే గోపకన్యలను ఆహ్వానిస్తూ వారిని " ఆయప్పాడి శెల్వ చ్చిఱుమీర్ కాళ్!" (రేపల్లెలో ఉండే సంపద కలిగిన చిన్న గోపికలారా!) అనే సంబోధించింది. అది ఏమి సంపద? రేపల్లెలో ఉండే గొల్లకన్యలకు ఉండే సంపద ఏమి? అని అంటే,

"జన్మాంతరసహస్రేషు తపోధ్యానసమాధిభిః,
నరాణాం క్షీణపాపానాం కృష్ణే భక్తిః ప్రజాయతే"

(వేలాది గత జన్మలలో చేసిన తపస్సు, ధ్యానం, సమాధుల కారణంగా మానవుల పాపాలు నశించి, వారికి భగవంతునిలో భక్తి కలుగుతుంది) అని పౌష్కరసంహిత చెబుతున్నది. అటువంటి కృష్ణభక్తి రేపల్లెలో ఉండే గోపికలకు గల సంపద. "ఉన్నిత్తు మற்றொరు దెయ్ వమ్ తొழாళ్ అవనై యల్లాల్" (భగవంతుని తప్ప, ఇంకొక దైవాన్ని కొలువదు) "విక్రేతుకామా కిల గోపకన్యా మురారిపాదార్పితచిత్తవృత్తిః, దధ్యాదికం మోహవశాదవోచత్, గోవింద దామోదర మాధవేతి" (శ్రీకృష్ణుని పాదాలలో నిమగ్నమైన మనోవ్యాపారాన్ని కలిగిన ఒక గోపిక పెరుగు మొదలైన వానిని అమ్మబోతూ, భక్తివల్ల ఏర్పడిన పారవశ్యం కారణంగా "గోవిందా! దామోదరా! మాధవా!" అని అంటూ అమ్మడం ఆరంభించింది) అని లీలాశుకుడు శ్రీకృష్ణకర్ణామృతంలో గొల్లకన్యల భక్తినిగూర్చి అన్నాడు. ఇటువంటి గోపికల కృష్ణభక్తియే ఇక్కడ వారికి కల సంపద. ఇటువంటి కృష్ణ భక్తిని కల గోపికలనే తిరుప్పావైలో గోదాదేవి "శెల్వ చ్చిఱుమీర్ కాళ్" అని సంబోధించింది. ఇటువంటి భక్తి ఎవరికీ కలుగుతుందో పై పౌష్కరసంహితావచనం తెలుపుతున్నది.

2) "నారాయణనే నమక్కే పఱై తరువాన్" నారాయణునిగూర్చి

"సర్వేష్వపి విభాస్వంతం తత్రాధార మాత్మనాం విభో!,
స్వసత్తాభాసకం సత్వం గుణసత్వవిలక్షణమ్"

అని పౌష్కరసంహితలోని 25 వ అధ్యాయంలో 42 వ శ్లోకం తెలుపుతున్నది.

"నరాణా మయనం నిత్యం నారాయణః, నారాః అయనం యస్య నారాయణః" అని రెండు వ్యుత్పత్తులను నారాయణశబ్దానికి శాస్త్రం తెలుపుతున్నది. "నారసమూహాలు ఎవనిలో ఉన్నాయో, అతడు నారాయణుడు. నారసమూహాలను ఎవడు ఆధారంగా కలిగి ఉన్నాడో, అతడు నారాయణుడు" అనేవి ఈ రెండు వ్యుత్పత్తులు.

ఈ నారాయణనామాన్ని గోదాదేవి ముందుగా మొదటి పాశురంలో అనుసంధించి, పాంచరాత్రశాస్త్రంలో తెలుపబడిన రెండు విధాలైన పై వ్యుత్పత్తులను తరువాత "నారాయణన్ మూర్తి" అని ఏడవ పాశురంలోను, "నాற்ற త్తுழாయ్ ముడి నారాయణన్" అని పదవ పాశురంలోను అనుసంధించినది. నారాయణనామానికి చెప్పబడే తత్పురుషసమాసార్థం ఏడవ పాశురంలోను, బహువ్రీహిసమాసార్థం పదవ పాశురంలోనూ అనుసంధించినది.

3) "నీరాడ ప్పోదువీర్ పోదుమినో!"

గోదాదేవి రేపల్లెలోని చిన్న గోపికలను మార్గశీర్షవ్రతస్నానాన్ని చేయడానికి ఆశను కలిగినవారిని రమ్మని ఈ విధంగా ఆహ్వానిస్తున్నది.

పాద్మసంహిత పలు విధాలైన స్నానాలను తెలుపుతూ

"వారుణం దివ్య మాగ్నేయం వాయువ్యం పార్థివం తథా,
మంత్రం మానస మిత్యేవం స్నానం సప్తవిధం స్మృతమ్"

అని –వారుణ స్నానం, దివ్య స్నానం, ఆగ్నేయ స్నానం, వాయవ్య స్నానం, పార్థివస్నానం, మంత్ర స్నానం, మానస స్నానం అని స్నానాలు ఏడు విధాలు అని తెలిపింది.

వీటిలో మానస స్నానం ఏమంటే, భగవంతుని ఎల్లప్పుడూ మనసులో స్మరించడమే. "యః స్మరేత్ పుండరీకాక్షం స బాహ్యాభ్యాంతర శ్శుచిః" అని ఎవడు పుండరీకాక్షుని స్మరిస్తున్నాడో అతడు లోపల, బయటకూడా పవిత్రతను పొందుతాడని చెప్పబడిందికదా. "శింధై మற்றொన్ఱిల్ తిఱత్తదల్లా త్తన్నై త్తేవపిరా నఱియుమ్" (పరాంకుశనాయకి చిత్తం వేరొకరు ఎవ్వరిలోనూ లగ్నం కాకుండా, దేవనాథునిలోనే లగ్నమై ఉన్నది) అని ఈ మానసికమైన భగవంతుని నిరంతరధ్యానాన్ని నమ్మాళ్వారులు కూడా పేర్కొన్నారు. ఈ విధమైన భగవంతుని స్వరూపరూప గుణలీలాలను మనసులో నిరంతరం భావించడం అనే మానసికస్నానమే ఇక్కడ తిరుప్పావై ప్రబంధంలో ఉదాదేవి నిర్దేశించింది అని మన పూర్వాచార్యులు తమ వ్యాఖ్యానాలలో వివరించారు కూడా. బాహ్యస్నానం మన బయటి శరీరాన్ని శుద్ధం చేయగా, ఈ మానసిక స్నానం పలు జన్మలుగా మనం చేర్చి పెట్టుకున్న పాపాల వల్ల ఏర్పడిన మానసిక మాలిన్యాన్ని తొలగించి శుద్ధం చేస్తుంది. "నాడొఱుమ్ తిరువుడై అడిగళ్ తమ్ నలమ్ కழల్ వణంగి–– మననక మల మఱ క్కழువి" (నిత్యం లక్ష్మీనాథుని కళ్యాణ గుణాలను కలిగిన పాదాలను నమస్కరించి, మనసులోని మాలిన్యాన్ని తొలగించుకొని) అని నమ్మాళ్వారులు కూడా అన్నారు. ఇదే, పాద్మసంహితలో, పారమేశ్వర సంహితలో ఈశ్వరసంహితలో, ఇంకా అనేక సంహితలలో చెప్పబడిన, తిరుప్పావై లో గోదాదేవి ప్రస్తావించిన మానసిక స్నానం.

4) "నారాయణన్", "పాఱ్కడలుళ్ పైయిత్తుయిన్ద పరమన్", "వడ మదురై మైందన్"

గోదాదేవి తిరుప్పావై ప్రబంధంలో శ్రీకృష్ణుడు సాక్షాత్తు భగవానుడే అని తెలియజేస్తూ మొదటి పాశురంలో "నారాయణనే నమక్కే" అని నారాయణ నామాన్ని అనుసంధించడం ద్వారా ఆ స్వామియొక్క పరరూపాన్ని నిర్దేశించినది. రెండవ పాశురంలో "పాఱ్కడలుళ్ పైయిత్తుయిన్ర పరమన్" అని వ్యూహరూపాన్ని ప్రస్తావించింది. ఐదవ పాశురంలో "వడ మదురై మైందనై" అని విభవ రూపాన్ని ప్రస్తావన చేసింది.

ఈ విధంగా పర, వ్యూహ, విభవ రూపాలను ప్రస్తావనను చేయడం పాంచరాత్రశాస్త్ర ప్రక్రియానుగుణమే కాక, హరివంశ పురాణ సూక్తికి కూడా అనుగుణం అని పెద్దలంటారు. "పరవ్యూహ విభవాత్మనా త్రివిధం బ్రహ్మ ఇతి భాగవత సిద్ధాంతః" (పరం, వ్యూహం, విభవం అనే విధంగా భగవంతుని రూపాలు మూడు ప్రకారాలుగా ఉంటాయి అని పాంచరాత్ర సిద్ధాంతం) అని శ్రీపరాశర భట్టర్ తమ సహస్రనామ భాష్యంలో అనుగ్రహించారు. ఈ క్రమంలో అర్చారూపం విభవరూపంలోనూ, అంతర్యామి రూపం పరరూపంలోనూ అంతర్భవిస్తాయి.

నమ్మాళ్వారులు కూడా తిరువాయ్ మొழி ప్రబంధంలో "విణ్ణోర్ తలైవా! కేశవా! గృహాలతో నిబిడంగా ఉండే ఇదిగో శేషు గారు అడిగారు ఏం చేస్తున్నారు మనై శేర్ ఆయర్ కులముదలే!" (పరమపదనాథా! కేశవా! గోపాలకులప్రభూ!) అని ఈ క్రమాన్నే అనుసరించి భగవంతుని సంబోధించారు. ఇక్కడ కేశవ నామం బ్రహ్మరుద్రులకు ఉత్పాదకుడైన ప్రద్యుమ్ననామాన్ని కలిగిన వ్యూహరూపాన్ని తెలుపుతున్నదని ఈడు మొదలైన వ్యాఖ్యానాలలో మన పూర్వాచార్యుల వ్యాఖ్యానం. తిరుప్పావై ప్రబంధంలో భగవంతుని పర, వ్యూహ, విభవ రూపాలు ఈ విధంగా అనుసంధింపబడడం హరివంశపురాణంలోని "ఏష నారాయణః శ్రీమాన్ క్షీరార్ణవనికేతనః, నాగపర్యంక ముత్సృజ్య హ్యాగతో మధురాం పురీమ్" (ఈ శ్రీకృష్ణుడు వైకుంఠంలో ఉండే శ్రీమన్నారాయణుడే. ఇతడే పాలకడలిని నివాసంగా

కలిగినవాడు. ఆదిశేషశయనాన్ని విడచిపెట్టి అక్కడనుండి మధురానగరకి వచ్చాడు కదా) అనే సూక్తికి అనుగుణం అని మన పూర్వాచార్యుల అభిప్రాయం.

5) పరత్వాది పంచక్రమం

భగవంతుని రూపాలు పరం వ్యూహ విభవ అంతర్యామి అర్చ ప్రకారాలలో ఐదు విధాలుగా ఉంటాయి అనే ఇంకొక పాంచరాత్రశాస్త్రక్రమం కూడా ఉన్నది. శ్రీ వాత్స్య వరదాచార్యులవారి పరత్వాది పంచకస్తుతి ఈ క్రమాన్ని అనుసరించి రచింపబడింది. ఈ క్రమాన్ని

"మమ ప్రకారాః పంచేతి ప్రాహుః వేదాంతపారగాః,
పరో వ్యూహశ్చ విభవో నియంతా సర్వదేహినామ్,
అర్చావతారశ్చ తథా దయాళుః పురుషాకృతిః,
ఇత్యేవం పంచథా ప్రాహుః మాం వేదాంతవిదో జనాః"

(పరం, వ్యూహం, విభవం, ప్రాణులను అందరినీ నియమించే అంతర్యామి రూపం, పురుషాకారంలో ఉన్నది, చాలా కరుణను కలిగినది అయిన అర్చారూపం అని ఈ విధంగా నా రూపాలు ఐదు విధాలుగా ఉంటాయి అని వేదాంతాన్ని తెలిసినవారు పలుకుతున్నారు) అనే విష్వక్సేన సంహితావచనం తెలియజేస్తున్నది.

తిరుప్పావై ప్రబంధంలో ఈ క్రమాన్ని కూడా గమనించవచ్చు అని వానమామలై జీయర్ స్వామి వారు తమ తిరుప్పావై స్వాపదేశ వ్యాఖ్యానంలో తెలియజేశారు మొదటి పాశురంలో నారాయణ నామ నిర్దేశం ద్వారా పరస్వరూపం రెండవ పాశురంలో క్షీరసముద్రంలో శయనించి ఉండే భగవంతుని రూపాన్ని నిర్దేశించడం ద్వారా వ్యూహ రూపం మూడవ పాశురంలో త్రివిక్రమావతారాన్ని ప్రస్తావించడం ద్వారా విభవరూపం నాలుగవ పాశురంలో ఆழி మழை క్కణ్ణా" అని పర్జన్యదేవునిలో అంతర్యామిగా ఉండే అంతర్యామి ప్రకారం ఐదవ పాశురంలో "వడ

మధురై మైందనై" అని అర్చారూపాన్ని ప్రస్తావించడం జరిగింది అని అభిప్రాయపడ్డారు.

★★★★★

# తిరుప్పావై – శ్రీపాంచరాత్రమ్ –3

తిరుప్పావైప్రబంధం న్యాసవిద్య అనబడే ప్రపత్తిని నిరూపించే ప్రబంధం. పాంచరాత్రశాస్త్రం ఈ న్యాసవిద్యను విశేషంగా నిరూపించింది. ఈ న్యాసవిద్యాస్వరూపాన్ని

"అనుకూల్యస్య సంకల్పః ప్రాతికూల్యస్య వర్జనమ్,
రక్షిష్యతీతి విశ్వాసః గోప్తృత్వవరణం తథా,
ఆత్మనిక్షేపకార్పణ్యే షడ్విధా శరణాగతిః"

(భగవంతుని రక్షణప్రయత్నానికి అనుకూలంగా వర్తించాలని ప్రయత్నం చేయడం, ప్రతికూలంగా ప్రవర్తించడాన్ని మానివేయడం, భగవంతుడు రక్షిస్తాడు అనే విశ్వాసాన్ని కలిగి ఉండడం, భగవంతుని రక్షకునిగా వరించడం, తన రక్షణభారాన్ని భగవత్సన్నిధిలో సమర్పించడం, తనను రక్షించగలిగినది ఏదీ తన వద్ద లేదు – అనే ఆకించన్యాన్ని భావించడం – అని ఈ విధంగా శరణాగతి ఆరు అంగాలను కలిగినది) అని పాంచరాత్రశాస్త్రంలోని అహిర్బుధ్న్యసంహిత నిర్వచించింది.

ఈ విధంగా చెప్పబడిన శరణాగతి అనే ఉపాయానికి సంబంధించిన ఆరు విధాలయిన అంగాలను కూడా తిరుప్పావై ప్రబంధంలో ఆయా పాశురాలలో మనం గమనించవచ్చు.

తిరుప్పావైలోని "వైయత్తు వాழ்వీర్ గాళ్!" అనే రెండవ పాశురంలో గోదాదేవి ఈ మార్గశీర్షవ్రతస్వరూపాన్ని తెలియజేస్తూ, కృత్యాకృత్యవివేకాన్ని విశదీకరించింది. అంటే, శరణాగతి అంగాలలోని ఆనుకూల్యసంకల్పాన్ని, ప్రాతికూల్యవర్జనాన్ని తెలియజేసింది. "పరమన్ ఆడి పాడి, నాట్కాలే నీరాడి,

ఐయముమ్ ఆందనైయుమ్ కైకాట్టి, పిచ్చైయుమ్ ఆందనైయుమ్ కైకాట్టి, ఉయ్యుమ్ ఆఱెణ్ణి, ఉగందు" అనేవి ఆరు ఆనుకూల్య సంకల్పాలు. "నెయ్యుణ్ణోమ్, పాలుణ్ణోమ్, మైయిట్టు ఎழுదోమ్, మలరిట్టు నామ్ ముడియోమ్, శెయ్యాదన శెయ్యోమ్, తీ క్కుఱళై చ్చెన్ఱోదోమ్" అనేవి ఆరు ప్రాతికూల్యవర్జనాలు. ఈ విధంగా ఈ భాషల ప్రారంభంలో శరణాగతిలోని రెండు అంగాలు నిరూపింపబడ్డాయి.

ఇదే విధంగా, ఈ పాశురంలోని చివరలో ఉండే "ఉయ్యుమ్ ఆఱెణ్ణి" (ఉజ్జీవించే ఆరు ప్రకారాలను భావించి) అనే ప్రయోగం కూడా శరణాగతికి సంబంధించిన ఆరు అంగాలను మనస్సులో భావించడం– అనే అనే అర్థాన్నికూడా సూచిస్తున్నందున, ఇది శరణాగతిస్వరూపాన్ని తెలియజేస్తున్నదని చెప్పవచ్చు.

ఇక్కడ, "నెయ్యుణ్ణోమ్, పాలుణ్ణోమ్" (నేతిని భుజించము, పాలను తాగము) అని అనడంలో అర్థం ఏమంటే, " వ్రతోపవాసతులిత మశనం తస్య పావనమ్" (భగవన్నివేదితమైన ప్రసాదాన్ని భుజించడం ఉపవాసంతో సమానం) అనే ప్రమాణానుసారంగా, మనంగా మన దేహపోషణను కోరి ఏ వస్తువును స్వీకరించము. " ఉడుత్తు క్కళైంద నిన్ పీతగవాడై ఉడుత్తు కలత్తదుండు" (నీవు ధరించి విడచిన పీతాంబరాన్ని ధరించి, నీవు ఆరగించగా విడచిన ప్రసాదాన్ని భుజించి) అని చెప్పినట్లుగా, భగవానుని శేషమైన వస్త్రాన్ని, ప్రసాదాన్ని అనుభవించవచ్చు తప్ప, భగవంతునకు నివేదించని ఏ వస్తువును మనం అనుభవించకూడదు– అని అర్థం. ఈ విషయం పాద్మసంహితలోని చర్యాపాదంలో 13వ అధ్యాయంలోని 83వ శ్లోకం పైవిధంగా ("వ్రతోపవాసతులితమ్"–ఇత్యాదిగా) తెలుపుతున్నది.

ఈ రెండవ పాశురంలో "పాఱ్కడలుళ్ పైయిత్తుయిన్ఱ పరమనడి పాడి" (పాలకడలిలో ఆదిశేషునిపై శయనించి ఉండే పరముని పాడి) అని అనడంకూడా పాంచరాత్రానుగుణమే. ఎందుకంటే, పాంచరాత్రాగమం వ్యూహమూర్తిని లక్ష్యంగా కలిగినదై ప్రవర్తించినది.

మూడవ పాశురంలో "ఉత్తమన్ పేర్ పాడి నాంగళ్ నంబావైక్కు చ్చాఱ్ఱి నీరాడినాల్, తీంగిన్ఱి నాడెల్లామ్ తింగళ్ ముమ్మారు పెయ్ దు–– నీంగాద శెల్వమ్ నిఱైందు" (ఉత్తముని పేరును కీర్తించి మనం వరత స్నానం చేసినట్లయితే, లోకంలో అంతా ఏ కీడు లేకుండా, వర్షం ప్రతినెలా మూడు మార్లు కురుస్తుంది–– ఏనాడు తరగని సంపద సిద్ధిస్తుంది) అని ఈ విధంగా అంటూ గోదాదేవి మార్గశీర్ష వ్రతఫలంగా ఇహలోక ఫలాలుకూడా సిద్ధిస్తాయి –అని చెప్పింది. ఈ విధంగా వ్రతానికి సంబంధించిన అవాంతర ఫలాలను ప్రస్తావించడం "ఆయు రర్థాం శ్చ భోగాంశ్చ ఆనుషంగికాన్, దదాతి ధ్యాయినాం నిత్య మపవర్గప్రదో హరిః" అని అహిర్బుధ్న్యసంహితావచనానుగుణం.

మూడవ పాశురంలో "ఓంగిగి ఉలగళంద ఉత్తమన్ పేర్ పాడి" అని త్రివిక్రమమూర్తిని గోదాదేవి శరణం పొందుతున్నట్లు పలకడం పాంచరాత్రశాస్త్రానికి చెందిన జితంతే స్తోత్రంలోని "లోకవిక్రాంతచరణౌ శరణం తే ఽ వ్రజం విభో! (ప్రభూ! లోకాలను అన్నిటినీ కొలిచిన నీ చరణాలను శరణు పొందాను) అనే సూక్తిని అనుసరించియే.

★★★★★

# తిరుప్పావై – శ్రీపాంచరాత్రమ్ –4

తిరుప్పావైలో నాలుగవ పాశురాన్ని గోదాదేవి

**ఆఴి** మ**ఱై** క్కణ్ణా!,ఒన్ఱు నీ కై కరవేల్ ★
**ఆఴి**యుళ్ పుక్కు,ముగందు కొడు ఆర్ త్తేఱి ★
ఊ**ఴి** ముదల్వన్,ఉరువమ్ పోల్ మెయ్ కఱుత్తు ★
పా**ఴి** అమ్ తోళుడై, ప్పఱ్పనాబన్ కైయిల్ ★★
ఆ**ఴి** పోల్ మిన్ని,వలమ్ పురి పోల్ నిన్ఱదిర్ న్దు ★
తా**ఴా**దే, శార్ జ్గమ్ ఉదైత్త శర మ**ఱై** పోల్ ★
వా**ఴ** ఉలగినిల్ పెయ్ దిడాయ్ ★ నాంగళుమ్
మార్గ**ఴి** నీరాడ,మగి**ఴ్**న్దు ఏలోర్ ఎమ్ పావాయ్

అని అనుగ్రహించింది

ఆండాళ్ మొదటి పాశురంలో భగవంతుని పరరూపాన్ని,రెండవ పాశురంలో వ్యూహ రూపాన్ని, మూడవ పాశురంలో విభవ రూపాన్ని ప్రస్తుతించినది. ఈ పాశురంలో గోదాదేవి,పర్జన్య దేవతను వ్రతానికి ఆవశ్యకమైన వృష్టిని కురవమని నియమిస్తున్నది. పాంచరాత్రాగమ దృష్టిలో ఈ పాశురాన్ని గమనించి చూసినప్పుడు,ఈ పాశురంలో భగవంతుని అర్చారూపం ప్రస్తావింపబడిందని చెప్పవచ్చు. (ఈ పాశురంలో భగవంతుని అంతర్యామి రూపం ప్రస్తుతింపబడిందని పూర్వాచార్యుల వ్యాఖ్యాన క్రమం ఉన్నది. ఈ వ్యాఖ్యానానికి ప్రస్తుత వివరణ విరుద్ధమని భావించనక్కరలేదు ఎందుకంటే,ప్రబంధానికి అనుగుణంగా రెండు అన్వయాలు చెప్పబడినప్పుడు,ఒక అన్వయం వేరొక

అన్వయాన్ని ఎప్పుడూ,ఏ విధంగాను విరోధించదుకదా!) శ్రీపాంచరాత్రంలోని చర్యాపాద క్రియాపాదాలు అర్చారూపాన్ని ఉద్దేశించేకదా ప్రవర్తించాయి. అర్చామూర్తికి సంబంధించిన ఆలయ నిర్మాణాలు,ప్రతిష్ఠ,జీర్ణోద్ధారణం,వివిధ ఉత్సవాలు,ప్రాయశ్చితాలు మొదలైనవి ఈ పాదాలలో వివరింపబడ్డాయి.

ఈ పాశురంలో అర్చామూర్తి ప్రస్తుతింపబడింది – అనేదానికి ఏమి ప్రమాణం? అని అంటే,పౌష్కరసంహితలోని ఈ క్రింది ప్రమాణాన్నిబట్టి ఈ విధంగా చెప్పవచ్చు. ఆ ప్రమాణాన్ని గమనించండి. ఈ నాలుగవ పాశురంలో ఆండాళ్ "వాழ ఉలగినిల్ పెయ్ దిడాయ్ నాంగళుమ్ మార్గழி నీరాడ,మగిழ்న్దు" అని అంటున్నది. ఇక్కడ "వాழ ఉలగినిల్ పెయ్ దిడాయ్" (ఉజ్జీవించేటట్లుగా లోకంలో వర్షించాలి) అని అనడంలో ఏమి తాత్పర్యం ? అని అంటే,

"యథా సముద్ర మంభోదైః స్పష్ట మేత్యుపభోగ్యతామ్,
తథైవ హి మనుష్యాణాం భక్తైః సంభావితో హరిః"

అనేది పౌష్కరసంహితలోని ఒక వచనం. ఏ విధంగా,మేఘం సముద్రంలో ఉండే ఉప్పు నీటిని అంతటినీ గ్రహించి,దానిని సర్వోపజీవ్యంగా,అందరూ ఉపయోగించుకోవడానికి వీలుగా ఉండేటట్లుగా మధురంగా చేసి,అంతటా వర్షిస్తుందో,ఆ విధంగానే,భగవంతుడు తన పరవ్యూహ విభవ అంతర్యామి రూపాలు సర్వోపజీవ్యాలుగా లేవనే సంగతిని గ్రహించి,తన రూపం సర్వోపజీవ్యంగా అయ్యేటట్లు అర్చారూపంలో అనుగ్రహిస్తున్నాడు. "బింబాత్మనా బింబే "అని విష్వక్సేన సంహితలో చెప్పిన విధంగా,తన దివ్యమంగళవిగ్రహంతో అర్చామూర్తిలో వేంచేసి ఉండి,అందరికీ దర్శనాన్ని అనుగ్రహించి,సకలపురుషార్థాలను ప్రసాదిస్తున్నాడు. లోకాలను ఉజ్జీవింప జేస్తున్నాడు. " యే యథా మాం ప్రపద్యంతే

తాన్ తథైవ భజామ్యహమ్” అని గీతలో శ్రీకృష్ణభగవానుడు చెప్పినట్లుగా,“ తమర్ ఉగందదు ఎవ్వురువమ్ అవ్వురువమ్ తానే,తమరుకందదు ఎప్పేర్ మற்ற ప్పేర్” అని సరోయోగి పలికినట్లుగా,అర్చామూర్తిలో భగవానుడు తన దివ్యమంగళ విగ్రహంతో సన్నిధిని కలిగి ఉండి,అందరినీ అనుగ్రహిస్తాడు. దీనినే ఇక్కడ ఈ పాశురంలోని “వాழ ఉలగినిల్ పెయ్ దిడాయ్” అనే ప్రయోగం సూచిస్తున్నది. అంతర్యామిరూపం యోగులకు మాత్రమే ధ్యేయమై ఉంటుంది,విభవరూపం తత్కాలీనం. ఆ అవతారాలు సంభవించినప్పుడు జీవించి ఉన్నవారికి మాత్రమే అనుభవయోగ్యంగా ఉంటుంది. . అది కూడా అందరికీ అనుభవయోగ్యం అని చెప్పలేము. కృష్ణావతారంలో కూడా మనుష్యత్వభావన కలిగినవారై నశించినవారు ఎంతమందో ఉన్నారు కదా. “ అవజానంతి మాం మూఢాః మానుషీం తను మాశ్రితమ్,పరంభావ మజానంతః” అని శ్రీకృష్ణ భగవానుడు గీతలో తన అవతారంలోని పరత్వాన్ని గుర్తించలేక,తన పట్ల కేవలం మానవత్వభావాన్ని కలిగి,లోకంలో పలువురు నశిస్తున్నారే! అని చాలా విచారంతో పలికాడు. శ్రీరామావతారంలో కూడా “సుగ్రీవో శంకిత శ్చాసీత్ నిత్యం వీర్యేణ రాఘవే” అని సందేహపడినవారు సుగ్రీవునివంటివారు ఎంతమందో ఉన్నారు. వ్యూహరూపం దేవతలకు మాత్రమే దరి చేరడానికి వీలైనది, మనకు దర్శించడానికి సాధ్యం కానిది. ఇక,పరం అయితే,పరమ పదాన్ని చేరినవారికి మాత్రమే అనుభవించడానికి సాధ్యపడే రూపం. ఇటువంటి క్లేశాలు ఏమీ లేకుండా,సామాన్యులు కూడా దర్శించి ఆనందించి తరించటానికి వీలుగా ఉండేటట్లుగా,“ సకల మనుజ నయన విషయతాం గతః” అని గీతాభాష్యావతారికలో భగవద్రామానుజులవారు

పలికినట్లుగా,అందరి నేత్రాలకు విషయమై ఉండే రూపం అర్చారూపం. అదే ఇక్కడ "వాழ ఉలగినిల్" అని సూచింపబడింది.

శాండిల్యస్మృతి అర్చామూర్తి దర్శన వైభవాన్ని తెలుపుతూ,

**"ఆపాదమౌళిపర్యంతం పశ్యతః పురుషోత్తమమ్,**
**పాతకాన్యాశు నశ్యంతి కిం పున స్తూపపాతకాః"**

(చరణాలనుండి శిరస్సువరకు ఉండే భగవంతుని అర్చామూర్తిరూపంలోని దివ్యమంగళవిగ్రహాన్ని దర్శిస్తే,చాలా తీవ్రమైన పాపాలు కూడా నశించిపోతాయి,ఇక చిన్న చిన్న పాపాల సంగతి గూర్చి చెప్పవలసినది ఏమున్నది?) అని అంటున్నది.

ఏదో ఒకచోట,పరిమితమైన ప్రదేశంలో కాకుండా,అన్ని చోట్ల నగరాలలో,పల్లెలలో,మందిరాలలో,గృహాలలో,వనాలలో,నదులలో,తటాకాలలో,పర్వ త శిఖరాలలో అంతటా భగవానుడు అర్చామూర్తి రూపంలో సన్నిధిని కలిగి ఉన్నాడు. ఇదే ఇక్కడ "ఉలగినిల్ వాழ" అని చెప్పబడింది. "ఆழిమణ్ణழక్కణ్ణా!" అనే సంబోధన కూడా అర్చామూర్తిని సూచిస్తుంది – అని చెప్పవచ్చు. ఎందుకంటే,సాక్షాత్తుగా దర్శించి సంబోధించడానికి వీలైన రూపం అదే కదా. భగవంతుని సౌలభ్యసౌశీల్యాలకు పరమావధి ఈ రూపంలోనే కదా, గోచరిస్తుంది.

ఈ విధంగా నాల్గవ పాశురం అర్చాపరమని చెప్పవచ్చు.

ఇక,అయిదవ పాశురాన్ని గమనిస్తే,ఇందులో భగవంతుని పర వ్యూహ విభవ అంతర్యామి అర్చారూపాలు ఐదు సూచింపబడ్డాయని భావించవచ్చు.

ఈ పాశురంలోని "మాయన్" అనే పదం ఆశ్చర్యకరమైన శక్తిని,జ్ఞానాన్ని, లీలలను కలవాడు – అనే అర్థం ఇస్తుంది. భగవద్రామానుజ సంప్రదాయంలో మాయాశబ్దం ఆశ్చర్యవాచి. "జనకస్య కులే జాతా దేవమాయేవ నిర్మితా" అనే శ్రీరామాయణవచనంలోని మాయాశబ్దానికి "ఆశ్చర్యకరమైన రూపాన్ని కలిగినది"

అనే అర్థం చెప్పబడింది. అందువల్ల,ఈ "మాయన్" అనే పదం నిత్యముక్తులకు సేవ్యమైన భగవంతుని పరరూపం తెలుపబడుతున్నది.

"మన్ను వడ మదురై మైన్దనై" (స్థిరమైన కీర్తిని కలిగిన ఉత్తర మధురా నగరంలో అవతరించిన బలశాలి) అని అర్థం. హరివంశ మహాపురాణం

"ఏష నారాయణః శ్రీమాన్ క్షీరార్ణవనికేతనః,
నాగపర్యంక ముత్సృజ్య హ్యాగతో మధురాం పురీమ్"

(ఈ శ్రీకృష్ణుడు వైకుంఠంలో ఉండే నారాయణుడే. పాల సముద్రాన్ని నివాసంగా కలిగినవాడు. అతడు ఆదిశేష శయనాన్ని విడచిపెట్టి,మధుర నగరానికి శ్రీకృష్ణుడుగా వచ్చాడు కదా)

అని అంటున్నది. అందువల్ల ఈ ప్రయోగం విభవరూపాన్ని తెలుపుతున్నది.

"యమునై త్తుఱైవనై" అనే ప్రయోగంలోని "తుఱై "అనే పదం ప్రకారవాచి. భగవంతుని వ్యూహరూపం వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్న అనిరుద్ధనామాలతో నాలుగు ప్రకారాలను కలిగి ఉంటుంది. అందువల్ల ఇక్కడ "తుఱైవన్" అనే పదం భగవంతుని వ్యూహ రూపాన్ని తెలుపుతుంది.

"ఆయర్ కులత్తినిల్ తోన్ఱుమ్ అణి విళక్కై" ఇక్కడ "అణి విళక్కు" అనే పదం అందరి హృదయాలలో జ్యోతివలె ప్రకాశిస్తూ ఉన్నది,యోగిధ్యేయమై ఉన్నది అయిన భగవంతుని అంతర్యామి రూపాన్ని తెలియజేస్తున్నది.

"ఇక, చివరి నామం" తాయై క్కుడల్ విళక్కమ్ శెయ్ ద దామోదరన్". ఇక్కడ దామోదరశబ్దం శ్రీరంగంలో సాక్షాత్కరించే శ్రీరంగనాథుని సూచిస్తున్నదని భావించవచ్చు. "యశోదానద్ధా ముగ్ధాభరణం నః సమాధిం ధినోతి" (యశోదాదేవి నడుముకు కట్టిన,అందమైన ఆభరణంవంటి దారం భగవంతుని సౌలభ్యగుణంలోని పరాకాష్ఠను తెలుపుతున్నందున,మన ఏకాగ్రతను భంగపరుస్తున్నది) అని శ్రీరంగరాజస్తవం పూర్వశతకంలో శ్రీపరాశర భట్టర్ దామోదరనామాన్ని శ్రీరంగనాథుని అర్చామూర్తిపరంగా సమన్వయించడాన్ని ఇక్కడ స్మరించాలి.

ఈ క్రమంలో తిరుప్పావై ప్రబంధంలోని ఐదవ పాశురంలో భగవంతుని పరవ్యూహాది ఐదు రూపాలు నిర్దేశింపబడ్డాయని భావించవచ్చు. శ్రీపాంచరాత్రంకూడా,ఈ విధంగానే,భగవంతుని ఈ ఐదు రూపాలను ప్రస్తావిస్తున్నది.

ఈ ఐదు రూపాలలోనూ భగవంతుడు సమస్తకల్యాణ గుణపూర్ణుడై,దివ్యమంగళవిగ్రహంతో సన్నిధిని కలిగి ఉంటాడు – అని శ్రీపాంచరాత్రశాస్త్రం చెబుతున్నది. పరమపదంలో ఎంతటి కళ్యాణగుణపూర్ణతను కలిగి ఉంటాడో,ఎటువంటి దివ్యమంగళ విగ్రహంతో వేంచేసి ఉంటాడో,మిగిలిన నాలుగు రూపాలలోను అటువంటి గుణ పూర్ణతను,అటువంటి దివ్యమంగళ విగ్రహంతోను భగవానుడు వేంచేసి ఉంటాడు. "దేవో వైకుంఠనాథ స్తు అనంతాసనసంస్థితః,సేవ్యః శ్రీభూమినీళాభిః,ప్రాదుర్భావైః తథా ౽ ఖిలైః,బింబాకృత్యాత్మనా బింబే" ఇత్యాదిగా సాత్త్వతసంహిత పలుకుతున్నది. ఇటువంటి ఐదు రూపాలతో ప్రకాశించే భగవంతుని శరణాగతి చేసినట్లయితే,విశేషించి,అర్చామూర్తిని శరణాగతి చేస్తే,మన పాపాలన్నీ నశిస్తాయని కూడా తెలిపింది. ఆ అర్థమే ఈ ఐదవ పాశురంలో "తూమలర్ తూవి త్తొழுదు,వాయినాల్ పాడి,మనత్తినాల్ శిందిక్క పోయ పిழைయుమ్ పుకుదరువా నిన్టనవుమ్ తీయనిల్ తూశాగుమ్" (పవిత్రమైన పూలను సమర్పించి నమస్కరించి,నోటితో పాడి,మనసులో ధ్యానం చేస్తే,భగవంతుని శరణు పొందడానికి పూర్వం అజ్ఞానం వల్ల చేసిన పాపాలు,ఆ తరువాత,ప్రమాదవశంచేత చేసిన పాపాలు అన్నీ అగ్నిలో పడిన దూదివలె రూపు లేకుండా నశించిపోతాయి) అనే అనుసంధింపబడింది.

★★★★★

# తిరుప్పావైలో అర్థపంచకమ్

తిరుప్పావై ప్రబంధం సకలవేదాంతసారం. ఆ ప్రబంధంలోని సారమైన అర్థాలను స్పష్టంగా తెలుసుకున్నట్లయితే, అర్థపంచకాన్ని సులభంగా గ్రహించవచ్చు. మోక్షం పొందాలనే కోరికను కలవాడైన ముముక్షువు అర్థపంచకాన్ని యథాతథంగా తెలుసుకోవాలని శ్రీపిళ్లై లోకాచార్యులవారు ముముక్షుప్పడి గ్రంథంలో అన్నారు. ఆ ఐదు అర్థాలు ఏమంటే, పరస్వరూపం, జీవస్వరూపం, ఉపాయస్వరూపం, ఫలస్వరూపం, విరోధి స్వరూపం – అనే ఐదు అర్థాలు.

ఆండాళ్ తల్లి తిరుపావై ప్రబంధంలోని మొదటి పాశురంలోనే ఈ అర్థపంచకాన్ని మనకు ఉపదేశించినది. అందులోని "నారాయణనే నమక్కే పఱై తరువాన్" అనే సూక్తిలోనే ఈ ఐదు అర్థాలను మనం గమనించవచ్చు.

1) "నారాయణన్" అనే పదం పరస్వరూపాన్ని తెలుపుతున్నది. నారాయణ శబ్దం రెండు అర్థాలను తెలుపుతుంది. అది, ఆ స్వామియొక్క పరత్వాన్ని, అంటే, భగవంతుడు అందరిని ధరించేవాడు, పాలించేవాడు, నియమించేవాడు– అనే విషయాన్ని తెలుపుతుంది. అంతేకాక, అతని సౌలభ్య గుణాన్ని, అంటే, అందరూ సులభంగా పొందడానికి వీలైనవాడు– అనే విషయాన్ని తెలుపుతుంది. భగవంతుడు అన్ని ఆత్మలలో లోపల అంతర్యామిగా ఉంటాడు కదా.

2) "నమక్కే" అనే ప్రయోగం జీవాత్మ స్వరూపాన్ని తెలుపుతున్నది. ఆత్మలన్నీ భగవంతునిలో చేరినవై ఉన్నాయి. "నమక్కే" అనే పదంలో ఉండే ఏవకారం ద్వారా గోదాదేవి భగవంతుని శరణు పొందడానికి సిద్ధంగా ఉండేవాని స్థితిని తెలుపుతున్నది. అంటే, ఎవడు ఆకించన్యాన్ని అనన్యగతిత్వాన్ని కలిగి ఉన్నాడో,

అతడే భగవంతుని శరణు పొందడానికి పూర్తి యోగ్యతను కలిగి ఉన్నాడు – అని తెలుపుతున్నది.

3) "నారాయణనే తరువాన్" అనేది ఉపాయస్వరూపాన్ని తెలుపుతున్నది. దీని అర్థం ఏమంటే, "భగవంతుడైన నారాయణుడే జీవాత్మలకు పరమ పురుషార్థాన్ని ఇవ్వగలిగినవాడు" – అని.

4) "పఱై" అనే పదం ఫలస్వరూపాన్ని తెలుపుతున్నది. ఇక్కడ "పఱై" అంటే, మనకోసం ఏ విధమైన ప్రయోజనాన్ని ఎదురు చూడకుండా, భగవంతునికే ఆనందాన్ని కలిగించే సేవలను చేయడం.

5) విరోధిస్వరూపం – భగవంతుడు మనలను రక్షించకుండా అడ్డుపడే మన స్వాతంత్ర్యం అనే స్వభావాన్ని తెలుపుతున్నది.

తిరుప్పావై ప్రబంధంలో ఇమిడి ఉండే ఈ ఐదు విషయాలను మన పూర్వాచార్యులు తమ వ్యాఖ్యానాలలో స్పష్టంగా వివరించారు. దానిని సంగ్రహంగా గమనిద్దాం.

1) పరస్వరూపం

"పాఱ్కడలుళ్ పైయిత్తుయిన్ఱ పరమన్" (పాలసముద్రంలో ఆదిశేషునిపై శయనించి ఉండే పరమాత్మ) అనే రెండవ పాశురంలోని సూక్తిలో పరత్వాన్ని కలిగిన స్వామి –అని,

"ఓంగి ఉలగళంద ఉత్తమన్" అని మూడవ పాశురంలో "మూడు లోకాలను కొలిచినవాడు, తనకు మించినవాడు ఎవడు లేనివాడు" అని,

"పఱ్పనాబన్" అని "బ్రహ్మను సృష్టి చేసిన తామర పువ్వును నాభిలో కలిగినవాడు" అని మూడవ పాశురంలో అనడం ద్వారా జగత్కారణస్వరూపుడని,

"యమునైత్తురైవన్" (యమునానదీ తీరంలో విహరించినవాడు) అని ఐదవ పాశురంలో అనడంద్వారా "పరమపవిత్రతను కలిగిన యమునానదీ తీరవిహారి, సర్వస్వలభుడు" అని,

"గోవిందన్" అని 27వ, 28వ, 29వ పాశురాలలో అనడం ద్వారా "పశువులను కాపాడేవాడు, పశువులకు ఆనందాన్ని కలిగించేవాడు, భూమికి ఆనందాన్ని కలిగించేవాడు" అని– ఈ విధంగా పలు పాశురాలలో పరమాత్మ స్వరూపం నిరూపించబడినది.

2) జీవాత్మ స్వరూపం –

ఇది, ఆరవ పాశురం మొదలుకొని, 15వ పాశురం వరకు ఉండే పది పాశురాలలో, ఆ యా గోపికలనుగూర్చి చేయబడిన సంబోధనలద్వారా స్పష్టపడుతున్నది.

ఈ పాశురాలలో, ఆత్మలు శ్రీవైష్ణవులతో కలసి ఉండాలని ఎల్లప్పుడూ అభిలాషించాలి– అని, భగవంతుని శ్రీవైష్ణవుల మూలంగానే ఆశ్రయించాలి – అని చూపబడింది.

ఇంతే కాక, 16వ, 17వ పాశురాలలో, భగవంతునకు చాలా ఇష్టులైన నిత్యసూరులను ప్రపన్నులు కీర్తించాలి– అనే విషయం కూడా చూపబడింది. 18వ పాశురం మొదలుకుని, 20వ పాశురం వరకు "ఆత్మలు లక్ష్మీదేవి పురుషకారంగా చేసికొనే భగవంతుని శరణాగతి చేయాలి" – అనే తత్వం చూపబడింది. నీళాదేవి అవతారమైన నప్పిన్నై బృందావనంలో శ్రీకృష్ణభగవానుని ప్రియమహిషి.

3) విరోధిస్వరూపం

విరోధిస్వరూపం రెండవ పాశురంలో వివరంగా తెలుపబడింది. భగవంతుని ఆశ్రయించడానికి ప్రయత్నించేటప్పుడు, మిగిలిన లౌకికవిషయాలలో దృష్టిని పెట్టకూడదు – అనే విషయాన్ని అందులో గోదాదేవి వివరంగా తెలిపింది. "నెయ్యుణ్ణోమ్, పాలుణ్ణోమ్" "నేతిని భుజించము, పాలను తాగము" అని అనడం ద్వారా ఈ విషయాన్ని గ్రహించవచ్చు. "మన పూర్వాచార్యులు చేయని కార్యాన్ని దేనిని మనం చేయకూడదు" అనే విషయాన్ని "శెయ్యాదన శెయ్యోమ్" అని అనడం ద్వారా సూచించింది.

ఈ మూడిటినే కాక, ఉపాయస్వరూప ఉపేయ స్వరూపాలను కూడా మనం చాలా ముఖ్యంగా తెలుసుకోవాలి. గోదాదేవి ఈ తత్వాలను గోపికల, గోపాలుర భావనలో పలుకుతూ, తిరుప్పావైలోని 28వ, 29వ పాశురాలలో వివరించింది. తిరుప్పావై ప్రబంధాన్ని వ్యాఖ్యానించిన పెరియ వాచ్చాన్ పిళ్లై, నాయనార్ మొదలైన పూర్వాచార్యులు తమ వ్యాఖ్యానాలలో చాలా విశదంగా, అద్భుతంగా ఈ విషయాలను వివరించారు. ఆ పాశురాల సారాన్ని ఇప్పుడు కొంచెం గమనిద్దాం.

4) ఉపాయ స్వరూపం – 28వ పాశురం

ఈ పాశురంలో గోదాదేవి "భగవంతుడే సిద్ధసాధనం" అని నిరూపించింది. అందులో, మొదట, తనకు కర్మజ్ఞానభక్తి యోగాలలో అభినివేశం లేదు – అనే విషయాన్ని తెలియజేసింది. మనకు కర్మయోగాన్ని చేయడానికి కావలసిన అధికారం లేదు. కర్మయోగంలో అభినివేశం కలవాడు జ్ఞానాధికుని అనుసరించాలికదా. మేమైతే, పశువుల వెంట అరణ్యాలకు వెళ్లే వారం– అని అన్నది.

కర్మయోగాన్ని చేసేవాడు భగవంతుడు వేంచేసి ఉండే దివ్య దేశాలకు వెళ్లి సేవించాలి. మమ్మల్ని చూస్తే, అరణ్యాలకు వెళుతున్నాము తప్ప, ఏ దివ్యదేశానికి వెళ్లడం లేదు. ఈ విధంగా అరణ్యాలకు వెళ్లడం కూడా తపస్సు చేయడం కోసం అయితే, అది కర్మయోగానికి అంగంగా భావించవచ్చు. కానీ, ఆ విధంగా మాఅ విషయంలో భావించే అవకాశం లేదు. ఎందుకంటే, మేము పశువులను మేపడంకోసం అరణ్యాలకు వెళుతున్నాము. ఈ విధంగా పశువుల అరణ్యాలకు తీసుకుని పోయి మేపడం వర్ణధర్మం– అని భావిస్తే, మేమైతే ఆ వర్ణధర్మాన్ని అనుసరించాలని బుద్ధితో ఆ పనిని చేయడం లేదు. పాలిచ్చే పశువులకు మాత్రమే ఆహారాన్ని పెట్టి, ఆ ధర్మాన్ని కూడా సరిగా ఆచరించడం లేదు.

ఆహారాన్ని స్వీకరించడంలో కూడా పలు నియమాలు ఉన్నాయి. మేము వాటిని ఏమాత్రం ఆచరించడం లేదు. నడుస్తూనే భుజించడం రెండు చేతులతోనూ తినడం, స్నానం చేయకుండా భుజించడం మొదలైన అకార్యాలను చేస్తున్నాము.

“అఱివొన్ఱు మిల్లాద ఆయ్ క్కులమ్” అని చెప్పినట్లుగా, జ్ఞానం ఏ మాత్రం లేని గొల్ల కులం మాది. అందుచేత, మాకు జ్ఞానయోగంలోకూడా అన్వయం లేదు. భక్తి అనేది జ్ఞానంయొక్క పరిణత దశకదా. అందువల్ల జ్ఞానం లేని మాలో భక్తియోగం కూడా లేదు అనేది సిద్ధం.

అయితే, మా దగ్గర ఒక పుణ్యంమాత్రం ఉన్నది. అది ఏమంటే, మేము “కృష్ణం ధర్మం సనాతనమ్” అనే విధంగా, చాలా గొప్పదైన ధర్మంగా చెప్పబడే భగవంతునికే పాలు, వెన్న, పెరుగులను పెట్టి పెంచుతున్నాము. అయితే, ఇది కూడా మా ప్రయత్నం వల్ల జరిగేది కాదు. నీవే కోరి, ఈ రేపల్లెకు వచ్చి, మా మధ్యలో నివసిస్తున్నావు. అందువల్ల, మాలో ప్రపత్తికి బాహ్యవిరోధులైన కర్మజ్ఞానభక్తి

యోగాలు అనేవి లేవు. ఇక, ఆంతర విరోధి అయిన "మేమే భగవంతుని పొందాలి" అని ప్రయత్నించడం అనే స్వగతస్వీకారం కూడా మా దగ్గర లేదు.

ఏ విధంగా అయితే మా దగ్గర జ్ఞానం అనేది లేదో, ఆ విధంగానే, నీ దగ్గర ఉండే జ్ఞానంలో ఏ కొరత లేదు. నీ సమస్త కల్యాణ గుణాలు నీవు గోపకులం మధ్యలో గోవిందుడవై ఉండే ఈ స్థితిలో చక్కగా ప్రకాశిస్తున్నాయి. నీవు నిత్యసూరుల మధ్య ఉండేటప్పుడు, నీ పరత్వం మాత్రమే ప్రకాశిస్తుంది. అయితే, నీవు ఇక్కడ గోపాలురతో, గోపికలతో కలసి ఉండేటప్పుడు, నీ సౌలభ్యం అనే గొప్ప గుణం ప్రకాశిస్తుంది. నీవు కల్యాణగుణాలు నిండినవాడవు, సిద్ధసాధనంగానూ ఉండేవాడవు మాత్రమే కాదు, నీవే సమస్తత్మలతో సహజమైన, అన్ని విధాలైన సంబంధాలను కలిగినవాడవు. సమస్తాత్మల లోపల అంతరాత్మగా ఉండేవాడవు నీవే. నీవు లేకుండా ఏ వస్తువు నిలువలేదు. నీచేత ప్రకాశింపజేయబడిన తిరుమంత్రం జీవాత్మలకు, పరమాత్మకు మధ్య సహజంగా ఉండే పితా–పుత్ర, రక్ష్య– రక్షకాది 9 విధాలైన సంబంధాలను చాలా అందంగా తెలుపుతున్నది. అందుచేత, నీకు, నిన్ను శరణు పొందినవారిని నిరీక్షించే బాధ్యత ఉన్నది.

అజ్ఞానంవల్ల, ప్రేమచేత నిన్ను కొన్ని సమయాలలో నారాయణనామాన్ని పురస్కరించుకొని పిలిచాము. నీవు ఇక్కడ రావడం ఎందుకంటే, , గోవిందుడువై, నీ సౌలభ్యాన్ని ప్రదర్శించడంకోసం కదా. అయితే, మేము నీ పరత్వాన్ని మాత్రమే తెలిపే నారాయణనామంతో నిన్ను పిలిచాము. అందుచేత, నీవు మమ్ములను మన్నించి అనుగ్రహించు. (నాయనార్ తమ వ్యాఖ్యానంలో "మనం భగవంతుని ఆశ్రయించేటప్పుడు, అతని వద్ద మన అపరాధాలకు క్షమాపణను వేడుకొని, ఆశ్రయించాలి"– అని ఇక్కడ గోదాదేవి ఉపదేశిస్తున్నట్లుగా వివరించారు)

“నీవే గొప్ప ఉపాయంగా ఉన్నందువల్ల, మాలో ఆకించన్యం, అనన్యగతిత్వం ఉన్నందువల్ల, నీవు మమ్ములను రక్షించడం కోసం ప్రయత్నం చేసేటప్పుడు మేము నీ ప్రయత్నాన్ని అడ్డుపెట్టకపోవడం అనే అప్రతిషేధం మా దగ్గర ఉన్నందువల్ల, మమ్ములను నీవు అనుగ్రహించి, ఉత్తమమైన కైంకర్యాన్ని మాకు నీవు అనుగ్రహించాలి.”

ఈ విధంగా అంటూ, గోదాదేవి, ఈ పాశురంలో భగవంతుడు మనలను రక్షించేటప్పుడు మన దగ్గరనుండి దేనిని ఎదురు చూడకపోవడం అనే అతని నిరపేక్షోపాయత్వాన్ని నిరూపించినది. ఇక్కడ, ముఖ్యంగా గమనించవలసినది ఒకటి ఉన్నది. భగవంతుడు మనలను రక్షించడానికి మన దగ్గర ఆకించన్యం, అనన్యగతిత్వం ఉండడం అనేది ఆవశ్యకం అయినప్పటికీ, అవి ఏవీ ఉపాయకోటిలోకి చేరవు. అవి, ముముక్షువు అయిన అధికారికి స్వరూపగతాలైన గుణాలే అవుతాయి. ఈ గుణాలు, , భగవంతుని దగ్గర శరణు పొందాలని కోరే జీవాత్మలను, మిగిలిన జీవాత్మల కంటే వేరు చేసి చూపిస్తాయి.

5) ఉపేయస్వరూపం – 29వ పాశురం

ఈ పాశురంలో, భగవంతునికి మాత్రమే ఆనందాన్ని అనుగ్రహించే కైంకర్యమే ఉత్తమమైన ఉపేయమని గోదాదేవి నిరూపించింది.

ఈ పాశురంలో గోదాదేవి “మేము నీ దగ్గర శరణు పొందడం కోసం చాలా ప్రాతఃకాలంలో నీ సన్నిధికి వచ్చాము” అని అంటున్నది. నాయనార్ అనే ఆచార్యులు ఇక్కడ ప్రాతఃకాలం అనేది మోముక్షో భగవాన్తుని ఆశ్రయించడానికీ తగిన ఆరంభ కాలంగా తెలియజేశారు. ఈ స్థితిలో అజ్ఞానం అనే చీకటి కొంచెం తొలగివున్నప్పటికీ, భగవంతుని విషయంలో అభినివేశం అనే వెలుతురు ఇంకా పూర్తిగా ఏర్పడలేదు.

ప్రాతఃకాలం అనేది సామాన్యంగా పూర్తి మెలకువతోను, జ్ఞానంతోను ఉండే దశగా భావింపబడుతున్నది.

"నీవే మమ్ములను రక్షించాలి. ఎందుకంటే, నీవు మాకు స్వామివి కనుక. అయితే, మేమే నిన్ను అన్వేషించి, నీ దగ్గరకు వచ్చాము దండకారణ్యమునులు తన దగ్గరకు రావడానికి చూసిన శ్రీరాముడు, వారిని అన్వేషించి తానే రావలసి ఉండగా, వారు తనను అన్వేషించి వచ్చి, తన దగ్గర ప్రార్థించే రీతిలో సంభవించింది కదా! అని మనసులో చాలా బాధపడ్డాడు. ఇక్కడ కూడా, ఆ విధంగానే ఉండే స్థితి ఏర్పడింది. స్వగత స్వీకారం అదేది ఆత్మల స్వరూపానికి ఎతమాత్రం తగనిది అయినందువల్ల, భగవంతునకు బాధను కలిగించే కృత్యమై అది పర్యవసిస్తుంది – అని ఇక్కడ వివరింపబడింది.

"మేము ఇక్కడకు రావడమే కాకుండా, నీకు నమస్కారాలను కూడా చేశాము. నీకంటే మిగిలిన దేవతలు తమ భక్తులు తమను ఎల్లప్పుడూ సేవిస్తూ ఉండాలని ఆశపడతారు. అయితే, భగవంతుడు మాత్రం స్వారాధ్యుడు, అంటే, సులభంగా ఆరాధించదగినవాడు. అతడు, "తన భక్తులు తనను నమస్కరించాలి"– అని కూడా ఎదురు చూడడు. భగవంతుని గొప్పతనం ఎటువంటిది? అంటే, ఏ విధంగా ఒక తండ్రి తన కుమారుని తనను చూడడానికి వస్తే చాలు –అని భావిస్తాడో, ఆ విధంగానే, భగవంతుడు కూడా, తన భక్తుని దగ్గరనుండి దేనిని ఎదురు చూడడు.

మేము, వైదికులు ఆశపడే నీ బంగారు పాదపద్మాలను కీర్తించాము. వేరు ఏ ప్రయోజనం కోసం మేము వాటిని కీర్తించలేదు. వాటిని కీర్తించడమే ప్రయోజనంగా భావించి, అదే ఉపాయంగా, అదే ఫలంగా భావించి, కీర్తించాము.

ఇప్పుడు మేము చెప్పేదానిని జాగ్రత్తగా ఆలకించు. మేము ఇంతకు ముందు "పఱై" అని చెప్పిన మాటకు అర్థం ఏమిటి? అంటే, దానిని వివరిస్తాము, విను నీవు ఇక్కడకు, బృందావనానికి రావడం మాత్రంతో చాలదు. మా ఆశలను కూడా నీవు నెరవేర్చాలి. నీవే కోరి గోపకులంలోకి వచ్చావు. నీవు, మమ్ములను నీకు తగిన అంతరంగ కైంకర్యంలో అభినివేశం కలిగి ఉండేటట్లుగా చేసి, దానిలో నియోగించాలి. ఈ పనిని నీవు చేసి తీరాలి. నీవే మమ్ములను సంస్కరించి, మా దగ్గర ఉండే భక్తిని అభివృద్ధి చేసినందున, కైంకర్యంలో కూడా అభినివేశాన్ని పొందేటట్లుగా మమ్ములను చేసి తీరాలి– అని గోదాదేవి అన్నారు.

అప్పుడు, శ్రీకృష్ణుడు ఆఆమెతో " నేను మీకు మార్గశీర్షవ్రత ఫలాన్నిమాత్రం ఇస్తాను" అని చెప్పాడు. గోదాదేవి, "ఈ వ్రతం అనేది నీ విషయంలో అభినివేశాన్ని పొందడానికి ఒక వ్యాజమే తప్ప, దీనిని ఒక సాధనంగా చేసుకుని, ఒక ప్రయోజనాన్ని పొందడం కోసం చేయలేదు. ఇది కేవలం నీ కైంకర్యరూపమే. నీ అంతరంగ కైంకర్యాన్ని తప్ప, వేరు ఏ ప్రయోజనాన్ని మేము కోరము – అని తరువాత వివరిస్తున్నది.

గోదాదేవి, తాను, పరమపదంలో కానీ, సంసారంలో కానీ, ఎక్కడ ఉన్నప్పటికీ, భగవంతునితోనే సదా కలసి ఉండాలని తాను కోరుతున్నట్లుగా వివరిస్తున్నది. ఏ విధంగా లక్ష్మణుడు శ్రీరాముని విడిచి ఉండకుండా, అరణ్యాలకు అతని వెంట వెళ్లి, అక్కడ అన్ని విధాలైన సేవలను శ్రీరామునకు చేశాడో ో, తాను కూడా ఆ విధంగానే శ్రీకృష్ణ భగవానుని ఏనాడు విశ్లేషించకుండా, అతని వెంట ఉండి, ఆ స్వామికి ఎల్లప్పుడూ కైంకర్యాన్ని చేసుకోవాలని కోరుతున్నట్లుగా పలుకుతున్నది. అంతేకాక, భగవంతుడు స్వామి కనుక, తాను సొత్తు కనుక, ఆ సంబంధం చక్కగా ప్రకాశించాలి – అని కోరుతున్నది.

చివరిగా, గోదాదేవి, గొప్ప ఫలంగా భగవంతునకు మాత్రమే ఆనందాన్ని కలిగించే కైంకర్యాన్ని అనుగ్రహించమని ప్రార్థిస్తున్నది. ఆమె, , భరతుని వలె చిరకాలం భగవంతుని విడచి దూరంగా ఉండడం కాకుండా, లక్ష్మణునివలె, భగవంతునితో ఎల్లప్పుడూ కలసి ఉండి, ఆ స్వామికి ఇష్టమైన అంతరంగదాస్యాన్ని చేయాలని ఆశపడుతున్నది. " మற்றை నమ్ కామంగళ్ మాற்று" (నీ కైంకర్యం కంటే మిగిలిన మా కోరికలను అన్నిటినీ లేకుండా చేయాలి) అని ప్రార్థించడంద్వారా "తనకోసంగా ఏ విధమైన ఆనందాన్ని ఎదురు చూడలేదు" అని, తన కోసంగా కోరుతున్నట్లుగా భగవంతుడు భావించకూడదు – అని నిశ్చయించి, పలుకుతున్నది.

ఇదే విషయాన్ని నమ్మాళ్వారులు కూడా " తనక్కే యాగ ఎనై క్కొళ్ళు మీదే" (నీ ఆనందం కోసమే నన్ను పరిగ్రహించు) (తిరువాయ్ మొழி– 2 –9) అని పలుకుతూ, భగవంతుడు, తన ఆనందం కోసమే తమను వినియోగించుకోవాలి– అని ప్రార్థించారు.

గోదాదేవి, ఈ విధంగా, తిరుప్పావైప్రబంధంలో, , చాలా గొప్ప ప్రాప్యమైన భగవంతుని కైంకర్యస్వరూపాన్ని వివరించింది. అంటే, భగవంతుని ఆనందంకోసం చేయకుండా, మన ఆనందంకోసం సేవను చేయడం తగదని తెలిపింది.

ఈ విధంగా, అర్థపంచకాన్ని గోదాదేవి తిరుప్పావై ప్రబంధంలోని ఆ యా సూక్తుల ద్వారా మనకు ఉపదేశించింది. ఈ విషయాలను తిరుప్పావైకు వ్యాఖ్యానాలను అనుగ్రహించిన పలువురు మన పూర్వాచార్యులు తమ వ్యాఖ్యానాలలో అద్భుతంగా వివరించారు. స్వస్తి.



# పుళ్ళిన్ వాయ్ కీండానై పొల్లా అరక్కనై కిళ్ళి క్కళైందానై

తిరుప్పావైప్రబంధంలో గోదాదేవి భగవంతుని పలు నామాలను కీర్తిస్తూ, ఆ స్వామి యొక్క కళ్యాణ గుణాలను, పలువీర చరిత్రలను మనకు దర్శింప జేసింది. ఈ ప్రబంధంలో ఆరవ పాశురం మొదలుకొని, 15వ పాశురం వరకు ఉండే పది పాశురాలలో తన తోటి గోపికలను పదిమందిని నిద్రలేపే సందర్భం గోచరిస్తుంది. ఈ పాశురాలలో ఆండాళ్ తల్లి ఒక్కొక్క గోపికను నిద్ర లేపుతూ, భగవంతుని పలు నామాలను ప్రస్తావించి, అటువంటి వైభవాన్ని కలిగిన భగవంతుని కీర్తించి, ఆ స్వామి సన్నిధికి పోయి మార్గశీర్ష వ్రతాన్ని ఆచరించడానికి తమతో కలసి రమ్మని పిలుస్తున్నది. ఈ క్రమంలో, మొదటి ఐదు పాశురాలలో, అంటే, ఆరవ పాశురం మొదలుకొని, పదవ పాశురం వరకు కల ఐదు పాశురాలలో, భగవంతుని ఎనిమిది నామాలను ప్రస్తావించింది.

11వ పాశురంలో " ముగిల్ వణ్ణన్ " (మేఘువర్ణుని) ను కీర్తించాలి రమ్మని పిలిచింది. 12వ పాశురంలో " తెన్నిలంగై క్కోమానై చ్చెత్త మనత్తుక్కినియాన్" (అందంగా ఉండే లంకానగరానికి అధిపతి అయిన రావణుని నశింపజేసిన మనసుకు మధురమైనవానిని) కీర్తించాలి, రమ్మని పిలిచింది. ఇక్కడ "మనసుకు మధురమైనవాడు" అని గోదాదేవి అనగానే, తోటి గోపికలు అందరూ శ్రీరాముని నామాలను కీర్తించడం ప్రారంభించారు. తరువాత గోపిక ఇంటికి దగ్గరకు వెళ్ళేటప్పుడు, , శ్రీరాముని వృత్తాంతాలను వారు కీర్తిస్తూ ఉండగా, 13వ పాశురం ఆరంభం అవుతున్నది. శ్రీరాముని ఒక వీరచరిత్రను వర్ణించే ఒక అద్భుతమైన నామంతో ఈ పాశురం మొదలవుతున్నది.

ఈ తిరునామం ఏమంటే, " పుళ్ళిన్ వాయ్ కీండానై పొల్లా అరక్కనై కిళ్ళి క్కళైందానై" అనేది.

ఈ ప్రయోగాన్ని మన పూర్వాచార్యులు " పుళ్ళిన్ వాయ్ కీండానై", , " పొల్లా అరక్కనై కిళ్ళి క్కళైందానై" అని రెండు భిన్ననామాలుగా స్వీకరించి. వీటిలో మొదటి నామం శ్రీకృష్ణుడు బకాసురుని వధించిన సందర్భాన్ని తెలుపుతున్నట్లుగా, రెండవ నామం శ్రీరాముడు రావణుని వధించిన సందర్భాన్ని వధించిన సందర్భాన్ని తెలుపుతున్నట్లుగాను వ్యాఖ్యానించారు.

అయితే, ఈ రెండు నామాలను కలిపి, ఒకే పెద్ద నామంగా గ్రహించి, ఇది అంతా శ్రీరాముని వైభవాన్ని తెలియజేసే నామంగా భావించి, అర్థం చెప్పే అవకాశం కూడా ఉన్నది. ఆ క్రమం ఏ విధంగానో కొంచెం భావన చేద్దాం.

ముందుగా, శ్రీరామ వైభవాన్ని తెలియజేసే ఈ తిరునామాన్ని అనుసంధానం చేస్తూ, లోపల ఉండే గోపికను నిద్రలేపవలసిన ఆవశ్యకత ఏమో చూద్దాం. ఇక్కడ లోపల ఉండే గోపికను ఉద్దేశించి సంబోధిస్తూ, "పోదరి క్కణ్ణినాయ్!" అని ఆండాళ్ పిలువడం జరిగింది. ఈ గోపిక కన్నులు లేడి కన్నులవలె ఉన్నవట. లేడి కన్నులకు శత్రువులవంటి కన్నులను కలిగినది, ఈమె. అంటే, ఈమె కన్నుల సౌందర్యం గొప్పదా? లేక, లేడికన్నుల సౌందర్యం గొప్పదా? అనే సందేహించే రీతిలో ఈమె నేత్రసౌందర్యం ఉన్నదని భావం. అటువంటి గొప్ప నేత్ర సౌందర్యం కలిగిన గోపిక ఈమె. ఈ విధంగా ఈ గోపిక కన్నుల అందాన్ని పొగడుతూ సంబోధించి, ఆమెను నిద్ర లేపే సందర్భం, ఇది.

శ్రీరామాయణంలో ఒక బంగారు లేడి ఒకరికి శత్రువుగా పరిణమించింది. అది ఎవరికి? అంటే, సీతాదేవికే కదా! బంగారు లేడి వెంట వెళ్లి, దానిని పట్టుకుని రమ్మని శ్రీరాముని ఆమె పంపించినందువల్లనే కదా అంతటి అనర్థం జరిగింది! సీతాదేవికూడా లేడి కన్నుల వంటి కన్నులను కలిగినదే. "మాழ் మాన్ మడనోక్కి" అని ఈ విషయాన్ని ఆళ్వారులు కూడా కీర్తించారు. ఈ విధంగా

ఇప్పుడు ప్రబోధింపబడే గోపిక, సీతాదేవివలె, చాలా గొప్పదైన నేత్రసౌందర్యాన్ని కలిగినది. ఈ విధంగా సీతాదేవివలె ఉండే ఈ గోపిక శ్రీరామునిగూర్చి కీర్తిస్తూ ఉండగా ఏ విధంగా నిద్రిస్తున్నది? అందులోనూ, ఎటువంటి శ్రీరాముడు అతడు?" పుళ్ళిన్ వాయ్ కీండానై పొల్లా అరక్కనై కిళ్ళి క్కళైందాన్". అందమైన నోటిని కలిగిన పక్షిని చీల్చిన దుర్మార్గుడైన రాక్షసుని గిల్లి పారవేసినవాడు కదా!

పలు పక్షులు గోచరించే శ్రీరామాయణంలో మనకు ఒక అందమైన పక్షి కనిపిస్తుంది, ఆ పక్షి ఎవరంటే, జటాయువే. అది చాలా మధురమైన వాక్కులను పలికే నోటిని కలిగినది. " యా మోషధిమివాయుష్మన్! అన్వేషసి వనే" (చిరంజీవీ! ఓషధిని వలె ఏ సీతాదేవి వనంలో నీవు వెతుకుతున్నావో) అని శ్రీరామునకు మంగళాశాసనం చేసినది. ఈ విధంగా మధురమైన వాక్కులను పలికే పక్షి కనుక ఇది "ఇన్ వాయ్ పుళ్" అని చెప్పదగినది. సీతాదేవిని అన్వేషిస్తూ అరణ్యంలో సంచరించే శ్రీరాముని చూచి జటాయువు, ఆమెను రావణుడు అపహరించుకొని వెళ్ళాడు అనే విషయాన్ని తెలియజేసినది. శ్రీరామునకు ఓదార్పును కలిగించే మధురమైన మాటలను జటాయువు చెప్పింది. అందువల్లనే ఈ జటాయువును గోదాదేవి "ఇన్వాయ్ పుళ్" అని కీర్తించింది. ఇటువంటి భగవన్మంగళాశాసనాన్ని చేసే పరమ పవిత్రమైన నోటిని కలిగిన జటాయును ఒక దుర్మార్గుడు చీల్చాడు. అతడు పరమక్రూరుడైన రావణుడేకదా. అందువల్ల అతడు "పొల్లా అరక్కన్" (దుష్ట రాక్షసుడు) . ఇటువంటి పరమభాగవతుడైన జటాయువును వధించిన పరమ క్రూరుడనే ఉద్దేశంతో రావణునిపై కోపాన్ని పొందిన శ్రీరాముడు ఏమి చేశాడు? అంటే, ఆ రావణునే కాక, అతనికి సంబంధించిన బంధువులను, పుత్రులను, అనుచరులను, పూర్తిగా లంకను కూడా నాశనం చేశాడు. అతని పది శిరస్సులను అవలీలగా గిల్లి పారవేశాడు. ఇటువంటి పరాక్రమశాలి, కరుణా స్వభావుడు అయిన శ్రీరాముని కీర్తించేటప్పుడు, సీతవలె అందమైన నేత్ర సౌందర్యాన్ని కలిగిన నీవు నిద్రపోవడం సరియైనదేనా? లేచి, మాతో కలిసి, ఆ స్వామిని సేవించకుండా ఉండడం న్యాయమేనా? అని గోదాదేవి లోపల ఉండే గోపికను పిలుస్తున్నది.



# తిరుప్పావైలో భగవన్నామవైభవమ్

గోదాదేవి అవతార ప్రయోజనాన్ని అనంతార్యులు అనే ఒక పూర్వాచార్యులు గోదాచతుఃశ్లోకి అనే ఒక చిన్న స్తోత్రంలో కీర్తిస్తూ,

"కల్పాదౌ హరిణా స్వయం జనహితం దృష్టేన సర్వాత్మనామ్
ప్రోక్తం స్వస్య చ కీర్తనం ప్రపదనం స్వస్మై ప్రసూనార్పణమ్,
సర్వేషాం ప్రకటం విధాతు మనిశం శ్రీధన్వినవ్యే పురే
జాతాం వైదికవిష్ణుచిత్తతనయాం గోదా ముదారాం స్తుమః"

(ఈ కల్పప్రారంభంలో భగవంతుడు లోకుల అందరి హితాన్ని మనస్సులో పెట్టుకొని, తన నామసంకీర్తనం చేయడం, తనను ఆశ్రయించడం, తనను పూలతో అర్చించడం– అనే ఉజ్జీవించే ప్రకారాలు ఉపదేశింపబడ్డాయి. వీటిని భగవంతునివల్ల తెలిసికొన్న భూదేవి వీటిని లోకులకందరు ఎల్లప్పుడూ తెలిసికొని ఆచరించేటట్లుగా చేయడం కోసం, శ్రీవిల్లిపుత్తూరు అనే దివ్యక్షేత్రంలో పరమ వైదికులైన శ్రీ విష్ణుచిత్తుల ప్రియపుత్రికగా గోదాదేవి అనే పేరుతో అవతరించినది. ఉదారమైన గుణాన్ని కలిగినది అయిన ఆ గోదాదేవిని నేను నమస్కరిస్తున్నాను) అని అన్నారు.

ఈ విధంగా భగవంతుడు తనకు ఉపదేశించిన, భగవంతుని నామసంకీర్తన, ప్రపదన, అర్చనాలనే ఉజ్జీవనప్రకారాలను గోదాదేవి తిరుప్పావై ప్రబంధాన్ని అనుగ్రహించడంద్వారా మనకు ఉపదేశించింది. ప్రతి పాశురంలోనూ భగవంతుని విలక్షణాలైన కొన్ని నామాలను ఆమె కీర్తించడం మనకు గోచరిస్తుంది. అయితే, ఈ భగవన్నామాలు అన్నీ ఆ యా పాశురాలలో ప్రధానంగా ప్రతిపాదింపబడే అర్థాలకు అనుగుణమై ఉండడం గమనించదగిన విషయం. ఈ

క్రమాన్ని ఇంచుమించుగా అన్ని పాశురాలలోనూ సమన్వయించి, అర్థాన్ని గ్రహించవచ్చు. ఉదాహరణకు, ముందుగా మొదటి పాశురాన్ని గమనించి చూద్దాం. తిరుప్పావై ప్రబంధంలోని మొదటి పాశురం "మార్గழி త్తింగళ్" అని ఆరంభం అవుతున్నది ఈ పాశురంలోని ప్రధానమైన ప్రమేయాన్ని మన పూర్వాచార్యులు తెలియజేస్తూ, ఇది ప్రాప్య ప్రాపక సంగ్రహాన్ని తెలియజేస్తున్నదని అన్నారు. అంటే, భగవంతుడైన శ్రీమన్నారాయణుడే పరమపురుషార్థాన్ని పొందడానికి తగిన, ఉత్తమమైన ఉపాయం అని, ఆ పురుషార్థంకూడా ఆ భగవంతుడే, అంటే, ఆ భగవంతుని మనస్సుకు ఆనందాన్ని కలిగించే కైంకర్యమే అని తెలియజేయబడుతున్నదని అన్నారు. ఈ ప్రాప్యప్రాపకాలే ఈ ప్రబంధంలో సారంగా ఉపదేశింపబడే ప్రధానార్థమని, అదే సంగ్రహంగా మొదటి పాశురంలో సూచింపబడిందని వారి అభిప్రాయం. దీనికి అనుగుణంగానే గోదాదేవి నారాయణనామాన్ని కీర్తించడం ఇక్కడ గమనించవలసిన విషయం.

నారాయణశబ్దానికి రెండు విధాలైన వ్యుత్పత్తులు చెప్పబడుతున్నాయి. అందులో, "నారాలు అనబడే జీవసమూహాలకు ఆయనం" అనేది ఒక వ్యుత్పత్తి. ఇది తత్పురుష సమాసం ద్వారా సిద్ధిస్తుంది. ఇక్కడ, ఆయనం అనే పదానికి రెండు విధాలైన అర్థాలను చెప్పే అవకాశం ఉన్నది. "ఈయతే ఇతి అయనమ్, అయ–గతౌ" అనే వ్యుత్పత్తిని గ్రహించినప్పుడు, ఆయన శబ్దానికి ఉపాయం అనే అర్థం వస్తుంది. "ఈయత ఇతి అయనమ్" అనే వ్యుత్పత్తిని గ్రహించినప్పుడు, పొందబడే ప్రయోజనం, అంటే, ఉపేయం అనే అర్థం వస్తుంది. ఈ విధంగా చేతనులకు మోక్షపురుషార్థాన్ని సాధించడానికి ఉపాయమై ఉండేవాడు, వారిచే పొందబడే ఉపేయమై ఉండేవాడు – అనే అర్థాన్ని ఇచ్చే నారాయణనామాన్ని ఆ అర్థాన్ని

ప్రతిపాదించే మొదటి పాశురంలో ప్రయోగించడం చాలా సందర్భోచితంకదా. ఇటువంటి సాభిప్రాయకమైన క్రమాన్నే మనం అన్ని పాశురాలలోనూ గమనించవచ్చు.

ఇపుడు ఐదవ పాశురాన్ని గమనిద్దాం. తిరుప్పావై ప్రబంధంలోని మొదటి పాశురంలో, వ్రతానికి లక్ష్యంగా, ఉపాయంగా నారాయణుని కీర్తించిన గోదాదేవి, ఆ వ్రత క్రమాన్ని ఆచరించేటప్పుడు, ఆ వ్రతానికి శాసిత అయిన పరముని రెండవ పాశురంలో పాడింది. మూడవ పాశురంలో, లోకానికి అంతటికి మంచిని అనుగ్రహించే ఆ ఉత్తముని పాడింది. ఆ హితాన్ని వ్రతానుగుణమైన వర్షాన్ని కురిపించడం ద్వారా అనుగ్రహించడంకోసం పర్జన్యరూపునిగా సాక్షాత్కరించవలసినదిగా నాల్గవ పాశురంలో ఆ స్వామిని ప్రార్థించింది. ఈ విధంగా మార్గశీర్ష వైభవాన్ని తన తోటి గోపికలకు తెలియజేసిన గోదాదేవికి చాలా సంతోషం కలిగింది. ఆమె తోటి చెలికత్తెలకు కూడా సంతోషం కలిగింది. అయితే, వారికి ఒక సందేహం మాత్రం మిగిలిపోయింది. "మనం చేసే ఈ వ్రతం నిర్విఘ్నంగా నెరవేరుతుందా ? మనం చేసుకున్న ప్రాక్తన కర్మలు ఈ వ్రతానికి అడ్డుపడవా?" అనే సందేహం వారి మనసులో కలిగింది. ఆ సందేహాన్ని గోపికలు అందరూ గోదాదేవికి తెలియజేయగా, అప్పుడు దానికి సమాధానంగా అయిదవ పాశురాన్ని గోదాదేవి అనుగ్రహించింది.

ఈ పాశురంలో "మాయనై, మన్ను వడమధురై మైందనై, తూయ పెరునీర్ యమునైత్తుఱైవనై ఆయర్ కులత్తినిల్ తోన్ఱుమ్ అణివిళక్కై, తాయై క్కుడల్ విళక్కమ్ శెయ్ ద దామోదరనై" (ఆశ్చర్యకరమైన శక్తిని కలవాడు, స్థిరమైన కీర్తిని కలిగిన ఉత్తరమధురానగరంలో అవతరించిన యువకుడు, పవిత్రమైన, గొప్ప నీటిని

కలిగిన యమునా నదీతీరంలో విహరించినవాడు, గోకులంలో అవతరించిన మంగళ దీపంవంటివాడు, తల్లి కడుపును ప్రకాశింపజేసిన దామోదరుడు) అని ఐదు భగవంతుని తిరునామాలను ప్రస్తుతించింది. ఈ ఐదు తిరునామాలను మనం పాడినట్లయితే, మన పాపాలు అన్ని అగ్నిలో పడిన దూదివలే రూపు మాసిపోతాయి –అని వారితో అన్నది. భగవంతుని తిరునామాలు అన్నీ పాపాలను హరించేవే అయినప్పటికీ, ఈ అయిదు తిరునామాలు ఏ విధంగా విశేషించి పాపాన్ని పోగొట్టగలిగినవో కొంచెం గమనిద్దాం.

ఈ ఐదు తిరునామాలలో మొదటి తిరునామం "మాయన్" అనేది. ఆశ్చర్యకరమైన శక్తిని కలవాడు, లీలలను చేసేవాడు – అని ఈ నామానికి అర్థం. ఈ నామాన్ని ఉచ్చరిస్తే, మనకు పవిత్రత కలుగుతుంది అని గోదాదేవి అనడానికి కారణం, ఈమె తండ్రిగారైన భట్టనాథులు తమ ప్రబంధంలో ఆ విధంగా పలకడమే. "తుప్పుడైయార్ అడైవదెల్లామ్" అనే దశకంలో పెరియాళ్వార్లు చివరి పాశురంలో

"మాయవనై మదుశూదననై మాదవనై మట్రైయోర్గళ్ ఏత్తుమ్
ఆయర్గళ్ ఏ**ఱ్ఱి**నై అచ్చుదనై అరంగత్తరవణై ప్పళ్ళియానై"

(ఆశ్చర్యకరమైన లీలలను చేసేవాడు, మధుసూదనుడు, మాధవుడు, వైదికులు స్తుతించే గోపాలకులంలో వృషభం వంటివాడు, అచ్యుతుడు, శ్రీరంగంలో ఆదిశేషునిపై శయనించి ఉండేవాడైన స్వామిని) స్తుతిస్తే, "తూయ మనత్తనరాగి వల్లార్ తూమణివణ్ణనుక్కు ఆళ్వర్ తామే " (పవిత్రమైన మనస్సును కలిగినవారై, పవిత్రమైన, ఏ దోషం లేని మణివంటి వర్ణాన్ని కలిగిన స్వామికి తాము దాసులు కాగలరు) అని అన్నారు. వీరి సూక్తిని అనుసరిస్తూ గోదాదేవి "మాయన్" అనే నామాన్ని అనుసంధిస్తే, మనపాపాలు తొలగిపోతాయి – అని అంటున్నది.

రెండవ నామం "వడ మదురై మైందనై" అనేది. మధురానగరం అనేది భగవంతుని చాలా ఇష్టమైన చోటు. "మధురా భగవాన్యత్ర సన్నిహితో హరిః" అని అంటారు కదా. ఈ మధురా నగరమే ఒకానొక సమయంలో మధువనం అనే పేరుతో వ్యవహరింపబడింది. భగవద్భక్తుడైన ధ్రువుడు ఇక్కడే తపస్సు చేసి భగవంతుని అనుగ్రహాన్ని పొందాడు. ఇక్కడ తపస్సు చేసినందువల్లనే అతని మనసు పవిత్రతను పొందింది. అటువంటి పవిత్రతను కలిగించగలిగిన శక్తిని కలిగిన క్షేత్రం, ఇది. అటువంటి మధురా క్షేత్ర మహిమను కీర్తించి, ఇక్కడ అవతరించిన భగవానుని కీర్తిద్దాం. మన పాపాలన్నీ తొలగిపోతాయి– అని అంటున్నది, గోదాదేవి.

మూడవ తిరునామం "యమునై త్తుఱైవనై" అనేది. ఎటువంటి "యమునై త్తుఱైవన్" ఇతడు? యమునా నదీతీరంలోనే విహారాన్ని చేసినవాడు, ఈ శ్రీకృష్ణ భగవానుడు. ఈ యమునా నది ఎటువంటిది? అంటే, " తూయ పెరు నీర్ యమునై" – పరమ పవిత్రమైన జలాలలను కలిగినది, ఈ యమునా నది. ఈ యమునానదీ జలాలకు కల పవిత్రత ఏమి? అంటే, యమునా నదికి కాలింది అని పేరు. "కలిం దమయతి ఇతి కాలిందీ" అని ఈ పదానికి కల వ్యుత్పత్తి. కలి దోషాన్ని పోగొట్టగలిగిన, అతి పవిత్రమైన నీటిని కలిగినది, ఈ నది. కలింద పర్వతంనుండి పుట్టి ప్రవహిస్తున్నది, ఈ నది. ఆ పర్వతం కూడా కలిదోషాన్ని పరిహరించగలిగినది. కలి అనదగిన ఘోర రాత్రుల ప్రభావాన్ని తీర్చి, పవిత్రతను కలిగించగలిగినది– అని ఈ పర్వతానికి సంబంధించిన చరిత్రలు చెబుతున్నవి. ఇటువంటి పవిత్రమైన నీటిని కలిగిన యమునానదీ తీరంలో విహరించిన శ్రీకృష్ణుని కీర్తిద్దాం. మన పాపాలన్నీ సమూలంగా తొలగిపోతాయి – అని అంటున్నది, గోదాదేవి.

నాల్గవ నామం "ఆయర్ కులత్తినిల్ తోన్రుమ్ అణివిళక్కై". అనేది గోకులానికి అంతటికి ఒక మంగళ దీపంగా శ్రీకృష్ణుడు అవతరించాడు– అని అంటున్నది. దీపం చీకటిని హరిస్తుంది. ఇక్కడ చీకటి అంటే, మనం చేసుకున్న పాపాలే. గోకులంలో మంగళ దీపంగా ఆవిర్భవించిన శ్రీకృష్ణ భగవానుడు మన పాపాలు అనే చీకటిని హరిస్తాడు. అతడు తప్ప వేరు ఎవరు మన పాపాలను పోగొట్టగలరు? అందువల్ల ఈ మంగళ దీపాన్ని పాడుదాం – అని అంటున్నది.

ఇక, చివరి నామం "తాయై క్కుడల్ విళక్కమ్ శెయ్ ద దామోదరనై" అనేది. ఈ దామోదరుడు ఎటువంటివాడు? అంటే, దామాన్ని, అంటే, దారాన్ని, తన నడుములో ఆభరణంగా కలిగినవాడు. యశోదాదేవి శ్రీకృష్ణుని నడుములో దారంతో కట్టిన వృత్తాంతాన్ని మనం స్మరిస్తే మన పాపాలన్నీ తొలగిపోతాయి– అని అన్నారు, యాదవభ్యుదయ మహాకావ్యంలో, వేదాంతదేశికులు. "బద్ధం తథా భావయతాం ముకుంద మయత్నవిచ్ఛేదిని కర్మబంధే" అనేది వారి సూక్తి. అందువల్ల, శ్రీకృష్ణ భగవానుని ఉలూఖలబంధ వృత్తాంతాన్ని మనసులో భావన చేస్తే, మన కర్మ బంధాలన్నీ తీరిపోతాయి, మన పుణ్య పాపాలన్నీ పటాపంచలు అయిపోతాయి. అటువంటి పాప హరమైనది దామోదర భగవానుని చరిత్ర. అటువంటి దామోదర నామాన్ని మనం పాడుదాం. మన పాపాలన్నీ తొలగిపోతాయి. మన పూర్వ పాపాలు నశించడమే కాక, ఉత్తర పాపాలు కూడా మనలను అంటవు. అన్నీ అగ్నిలో పడిన దూది వలె రూపు లేకుండా అయిపోతాయి ఈ మార్గశీర్ష వ్రతాన్ని చేయడానికి ఆవశ్యకమైన అర్హతను మనం పొందగలం– అని అంటున్నది, గోదాదేవి.

ఈ విధంగా పాపాలను హరించే ఈ ప్రకరణంలో గోదాదేవి అనుసంధించిన భగవన్నామాలు అన్ని విశేషంగా పాపహరాలు కావడం విశేషం.



సాంప్రదాయిక వ్యాస మాలిక

# తిరుప్పావైలో భగవన్నామవైభవమ్–2

## ("మాற்றாరై మాற்றழிక్క వల్లానై మాయనై")

మార్గశీర్షవ్రతాన్ని ఆచరించడంకోసం గోదాదేవి తన తోటి గోపికలను అందరిని పిలిచుకొని వెళ్ళాలి అని తలచి, వారిలో ఒక్కరిని కూడా విడువకూడదు అనే ఉదారమైన ఆశయంతో, పదిమంది గోపికలను నిద్రలేపే సందర్భం మనకు తిరుప్పావై ప్రబంధంలో ఆరవ పాశురంనుండి 15వ పాశురం వరకు పది పాశురాలలో గోచరిస్తుంది. వారి ఇళ్ళ దగ్గరకు వెళ్లి, భగవాన్నామాలను అనుసంధానం చేస్తూ, వారికి సుప్రభాతం పలికే సన్నివేశం మనకు గోచరిస్తుంది. ఈ క్రమంలో, 15వ పాశురంలో పదవ గోపిక నిద్ర లేపబడుతున్నది. ఆమెను నిద్ర లేపుతూ గోదాదేవి "మాற்றாరై మాற்றழிక్క వల్లాన్, మాయన్ " అనే రెండు అద్భుతమైన భగవన్నామాలను అనుసంధానం చేసింది.

ఈ పాశురంలో ప్రబోధింపబడే గోపిక వయస్సులో చాలా చిన్నది. చిలుకవలె మధురంగా పలుకగలిగినది. అందువల్ల ఈమెను గోదాదేవి "ఇళమ్ కిళియే!" అనే విశేషణంతో సంబోధిస్తున్నది. ఇటువంటి ఈమెను ప్రబోధిస్తూ, "మాற்றாరై మాற்றழிక్క వల్లాన్, మాయన్ " అనే భగవన్నామాలను అనుసంధించడంలో ఉండే తాత్పర్యం ఏమి ?అనేది గమనించదగిన విషయం.

ఆండాళ్ తల్లి ఇంతవరకు 9 మంది గోపికలను నిద్రలేపింది. వారిని నిద్ర లేపడంలో 13నామాలను అనుసంధించింది. ఈ నామాలను అన్నిటిని ఆలకించినది, ఈ పాశురంలో నిద్ర లేపబడే చిన్న వయస్సులో ఉండే గోపిక. వాటిని తన మధురమైన కంఠస్వరంతో గానం చేయడం ఆరంభించింది. ఈమె మధురమైన గానాన్ని విన్న ఆండాళ్ ఈమెను "ఇళమ్ కిళియే!" అని సంబోధిస్తున్నది.

శ్రీరాముడు సీతాదేవి వాఙ్మాధుర్యాన్నిగూర్చి హనుమంతునితో పలుకుతూ "మధురా మధురాలపా" అని అన్నాడు నమ్మాళ్వారులుకూడా ఈమె వాఙ్మాధుర్యాన్ని కీర్తిస్తూ "కిళి మొழியాళ్" (చిలుకవలె మధురంగా మాట్లాడేది) అని అన్నారు. అందువల్ల ఇక్కడ, గోదాదేవి "ఇళమ్ కిళియే!" అని సంబోధించిన గోపిక సీతవంటి స్వభావాన్ని కలిగినది –అని తెలుస్తున్నదికదా. ఇటువంటి స్వభావాన్ని కలిగిన గోపికకు ప్రబోధాన్ని పలికేటప్పుడు ఈమెకు ఇష్టమైన నామాన్నికదా అనుసంధించాలి. తదనుగుణంగానే ఇక్కడ ఆండాళ్ భగవన్నామానుసంధానాన్ని చేసింది. ఈ విషయాన్ని కొంచెం గమనిద్దాం.

సీతాదేవివలె మధురంగా పలుకగలిగిన స్వభావాన్ని కలిగిన ఈ గోపికను నిద్ర లేపేటప్పుడు ఈమె మనసు సంతోషించే విధంగా శ్రీరాముని వైభవాన్ని తెలియజేసే నామాలను అనుసంధించడం కదా ఉచితం. ప్రకృతంలో ఆండాళ్ " మాற்றாரై మాற்றழిక్క వల్లాన్, మాయన్" (విరోధులలోని బలపరాక్రమాలను నశింపచేయగలిగిన ఆశ్చర్యకరమైన లీలలను చేసేవాడు) అనే రెండు నామాలను కీర్తించింది. ఈ రెండు నామాలు శ్రీరాముని వైభవాన్ని ఏ విధంగా తెలుపుతున్నాయో చూద్దాం.

లంకలో శ్రీరామునకు, రావణునకు మధ్య భీకరమైన యుద్ధం జరుగుతున్నది. రాముని శరప్రహారాలకు రావణుడు ఎదురు నిలువలేకపోయాడు. అతని సారథి గాయపడ్డాడు. అతని కిరీటం క్రింద పడిపోయింది. అతడు చేతిలో ధరించిన వింటి పైభాగాన్ని, క్రింది భాగాన్ని శ్రీరాముడు తన బాణాలతో భగ్నం చేశాడు. ఇక ఏ విధంగానూ శ్రీరాముని పై బాణాలను సందించి ప్రయోగించగలిగిన స్థితిలో రావణుడు లేడు. నిర్వీర్యుడై, నిరుత్తరుడై అతడు నిలబడడాన్ని గమనించిన శ్రీరాముడు అతనిపై బాణాలను ప్రయోగించడం నిలిపివేసి, "గచ్ఛానుజానామి రణార్ధిన స్త్వమ్" "రావణా! నేను అనుమతిస్తున్నాను. ఇంటికి వెళ్ళు. బాగా

ఆలోచించుకో. మళ్లీ తిరిగి నాతో యుద్ధం చేయాలనే అనిపిస్తే రా" అని తన చేతజిక్కిన శత్రువు అయిన రావణుని ఉదారంగా విడచి పెట్టాడు. అటువంటి పరాక్రమశాలి, ఉదారుడు అయిన శ్రీరాముని చూసి రావణుడు ఆశ్చర్యపడడమే కాదు, భయపడ్డాడు కూడా. " బ్రహ్మదండప్రకాశానాం విద్యుజ్జ్వలితవర్చసామ్, స్మరన్ రాఘవ బాణానాం వివ్యథే రాక్షసేశ్వరః" (శ్రీరామాయణం– యుద్ధకాండ –60–3) (బ్రహ్మదండంవలె ప్రకాశాన్ని కలిగినవి, విద్యుత్ ప్రకాశాన్ని కలిగినవి అయిన శ్రీరాముని బాణాలను గుర్తు చేసుకొని రావణుడు మనస్సులో చాలా భయపడ్డాడు) . అని వాల్మీకి మహర్షి ఈ సందర్భాన్ని తెలిపాడు.

ఆ విధంగానే, ఇంకొక పర్యాయం రణరంగంలో శ్రీరాముని బాణాల ప్రభావానికి రావణుడు మోహాన్ని పొందాడు. అప్పుడు అతని సారథి అతనిని రక్షించడం కోసం యుద్ధరంగం నుండి పక్కకు తీసుకొని వెళ్ళాడు. కొంతసేపటికి తెప్పరిల్లిన రావణుడు సారథిని చూసి " శత్రోః ప్రఖ్యాతవీర్యస్య రంజనీయస్య విక్రమైః, పశ్యతో యుద్దలుబ్ధోహం కృతః కాపురుషః త్వయా" (శ్రీరామాయణం –యుద్ధకాండ– 106–6) (సారథీ! ఎంత పనిచేశావు? శ్రీరాముని పరాక్రమం శత్రువులకు కూడా ఆనందాన్ని కలిగించేది కదా. అతనితో యుద్ధం చేయాలనే కోరిక కలిగిన నన్ను అతని ముందు చేతగానివానిగా చేశావే?) అని అన్నాడు.

ఈ విధంగా బ్రహ్మదత్తవరబలాన్ని కలిగినవాడు, ముల్లోకాలను తన వశంలో పెట్టుకున్నవాడు, బద్ధశత్రువు అయిన రావణుని మనసును సైతం తన వీర్య పరాక్రమాలతో ఆకర్షించి, అతని బలపరాక్రమాలను నశింపజేయగలిగినవాడు, అటువంటి రీతిలో ఆశ్చర్యకరమైన యుద్ధాన్ని చేయగలిగినవాడు అయిన శ్రీరాముని ఈ రెండు నామాలతో ఆండాళ్ కీర్తించడం. ప్రకృతంలో సీతాదేవివంటి గోపికను ప్రబోధించే సందర్భంలో అనుగుణం కదా.

★★★★★

# ఎల్లే! ఇళమ్ కిళియే!"

తిరుప్పావై ప్రబంధంలో ఆండాళ్ తల్లి ఆరవ పాశురంనుండి 11వ పాశురం వరకు వరుసగా పది పాశురాలలో 10 మంది గోపికలను నిద్రలేపుతున్నది. స్వాపదేశర్థంలో, అంటే, తత్వార్థంలో ఈ గోపికలు గోపికలు కాదు, ఆచార్యులే. ఆచార్యులను పురస్కరించుకొని భగవంతుని ఆశ్రయించాలి – అనే శిష్టక్రమాన్ని అనుసరించి గోదాదేవ ఈ విధంగా పదిమంది ఆళ్వారులను, ఆచార్యులను నిద్రలేపుతున్నది అని అభిజ్ఞులైన మన పూర్వాచార్యులు వ్యాఖ్యానం చేశారు. వారి వ్యాఖ్యానాన్ని అనుసరించి చూసినప్పుడు, ఈ పది పాశురాలలో ఆ యా గోపికలకు ఆండాళ్ తల్లి ప్రయోగించిన విశేషణాలు, సంబోధనలు ఆచార్యపరంగా సమన్వయం చేసుకునే అవకాశం ఉన్నది. ఈ క్రమంలో పెద్దల వ్యాఖ్యానం కూడా ఉన్నది.

ఆండాళ్ 15వ పాశురంలో తాను నిద్ర లేపే గోపికను "ఎల్లే! ఇళమ్ కిళియే!" అని అంటూ చిలుకగా సంబోధిస్తున్నది. సదాచార్యులకు చిలుకతో కల సామ్యాన్ని పలు క్రమాలలో సంభావించవచ్చు. వాటిలో కొన్నిటిని మహావిద్వాన్ ప్రతివాది భయంకరమ్ అణ్ణంగరాచార్య స్వామివారు తెలిపిన క్రమంలో గ్రహిద్దాం.

1) "శుకః పంజరబంధస్థే మధురాణాం గిరాం ఫలమ్" అని చెప్పినట్లుగా, చిలుక మధురమైన వాక్కులను పలుకగలిగినది కనుక, పంజరంలో బంధింపబడి ఉంటుంది. ఆచార్యులు కూడా ఆ విధంగానే మధురమైన వాక్కులను కలిగినవారు కనుక, శిష్యులు మొదలైనవారి నిర్బంధాలకు వశమై ఉంటారు, అంటే, వారి ప్రార్థనలకు అంగీకరించి వర్తిస్తారు. వారికి మధురమైన ఉపదేశాలను అనుగ్రహిస్తారు. అందువల్ల వారు చిలుకవంటివారు.

2) నేర్పించిన మాటలనే తిరిగి చిలుక పలుకుతుంది. అంతే తప్ప, తానుగా ప్రయత్నించి ఏ విధంగా ఏ విధమైన మాటను పలుకదు, పలికే స్వభావాన్ని కలిగినది కాదు. సదాచార్యులు కూడా ఆ విధంగానే, తమకు ముందున్న ఆచార్యులు చెప్పిన అర్థాలకు అనుగుణంగానే ఉపదేశిస్తారు. తాము కొత్తగా ఒక క్రమాన్ని సృష్టించి చెప్పాలని ఏనాడు ప్రయత్నించరు. " మున్నోర్ మొழிన్ద వழி తప్పామల్ కేట్టు, పిన్నోర్ న్దు తామ్ అదనై ప్పేశుమ్" (తమకు ముందున్న పూర్వాచార్యులు పలికిన మార్గాన్ని తప్పకుండా విని దానిని అనుసరించి పలికేవారు) గానే సదాచార్యులు ఉంటారు, కనుక, వారు చిలుకవంటివారు.

3) చిలుక రూపసౌందర్యంలో చాలా గొప్పది. ఎల్లప్పుడూ పచ్చని వర్ణంతో మిసమిసలాడుతూ ఉంటుంది. ఆచార్యులుకూడా బ్రహ్మతేజస్సుతో ప్రకాశిస్తారు. " వసతి హృది సనాతనే చ తస్మిన్ భవతి పుమాన్ జగతో ౽ స్య సౌమ్యరూపః" (శ్రీవిష్ణుపురాణం– తృతీయాంశం – 7– 24) (ఎవని హృదయంలో సనాతనుడైన పరమాత్మ ఉంటాడో, అతడు జగత్తుకు సౌమ్యరూపుడుగా కనిపిస్తాడు) అనే విధంగా ఎల్లప్పుడూ పరమాత్మను హృదయంలో నిలుపుకొని ధ్యానం చేసే సదాచార్యుల రూపం చాలా సౌమ్యంగా, చూడముచ్చటగా ఉంటుంది. " బ్రహ్మవిద ఇవ సౌమ్య తే ముఖం భాతి" అనే ఉపనిషద్వాక్యం ఇక్కడ స్మరణీయం. అందువల్లకూడా ఆచార్యులు చిలుకవంటివారు.

4) చిలుక రూపం, దానిని పెంచేవారికి మనోహరంగా ఉంటుంది. సదాచార్యుల రూపం కూడా వారి శిష్యులకు అందంగా, ఆరాధ్యంగా ఉంటుంది. " ఆశారియన్ శిచ్చన్ ఆరుయిరై ప్పేణుమవన్, తేశారుమ్ శిచ్చన్ అవన్ శీర్ వడివై" (సదాచార్యుడు శిష్యుని ఆత్మను అభిమానించాలి, శిష్యుడు ఆచార్యుని రూపాన్ని అభిమానించాలి) అని శ్రీమణవాళ మహామునులు ఉపదేశరత్తినమాలై ప్రబంధంలో పలికిన సూక్తి స్మరించదగినది. ఈ విధంగా కూడా ఆచార్యులు చిలుక వంటివారు

5) చిలుక వలలో చిక్కుకుంటుంది. ఆచార్యులు అనే చిలుకలు " ఉన్ తామరై క్కణ్గళిన్ వழிగళిన్ అగవలై ప్పడుప్పాన్" (నీ తామరపూలవంటి నేత్రాలద్వారా వలలో బంధించడం కోసం) అనే నమ్మాళ్వారుల సూక్తి ప్రకారం భగవంతుని నేత్రాలు అనే వలలో చిక్కుకుంటారు.

6) చిలుక, తనను పెంచినవారికి తన ముద్దు ముద్దు మాటలతో ఆనందాన్ని కలిగిస్తుంది. సదాచార్యులు కూడా తమను తీర్చిదిద్దిన ఆచార్యులకు తమ జ్ఞానభక్తివైరాగ్యాలతో, అనుష్ఠానంతో ఆనందాన్ని కలిగిస్తారు. "వళర్ త్తదనాల్ పయన్ పెற்றேన్ వరుగ ఎన్ను మడక్కిళియై కైకూప్పి వణంగినాళే" ("నేను నిన్ను పెంచి నందులవల్ల తగిన ఫలన్ని పొందాను, నా దగ్గరకు రా" అని ముద్దుగా పెంచిన చిలుకను దగ్గరకు పిలిచి, దానికి పరకాల నాయకి నమస్కరించింది) అనే తిరుమంగై ఆళ్వారుల తిరునెడుందాండక ప్రబంధసూక్తి స్మరణీయం. నంజీయర్ తమ శిష్యులు అయిన నంబిళ్ళైను అభిమానించిన వృత్తాంతం ఇక్కడ స్మరించదగినది

7) "ఇన్నడిశిలొడు పాలముదూట్టి యెడుత్త ఎన్ కోలక్కిళియే!" (తీయని పాయసంతో పాటు పాలను కూడా తాగించి పెంచిన నా అందమైన చిలుకా!) అని అంటూ గోదాదేవి తన ప్రబంధంలో పలికినట్లుగా, చక్కని మధుర పదార్థాలతో చిలుక పెంచబడుతుంది. " ఎనక్కెన్నుమ్ తేనుమ్ పాలుమ్ అముదమాయ తిరుమాల్ తిరునామమ్ -- నమో నారాయణమే" అని భగవానుని పరమ భోగ్యమైన తిరుమంత్రం మొదలైనవాటితో తమ ఆచార్యులచే పెంచబడిన చిలుకయే సదాచార్యుడు. ఈ రీతిలో కూడా సదాచార్యులకు చిలుకతో సామ్యం ఉన్నది.

ఈ విధంగా పలు రీతులలో సదాచార్యులకు, చిలుకకు మధ్య సామ్యాలను భావించవచ్చు. ఈ సందర్భంలో, శ్రీవిల్లిపుత్తూరు దివ్యక్షేత్రంలో ఉండే అండాళ్ తల్లి అర్చావిగ్రహం చేతిలో అందమైన చిలుక అమరి ఉండి, మనకు దర్శనాన్ని అనుగ్రహించడంకూడా స్మరించదగినది. స్వస్తి.



# తిరుప్పావైలో శ్రీవేంకటేశ్వరుడు

దివ్యసూరులందరి జ్ఞానపుత్రికగా కీర్తింపబడే గోదాదేవి శ్రీకృష్ణభగవానుని సంశ్లేషాన్ని కోరి, తిరుప్పావై వ్రతాన్ని ఆచరించి, తాను ఆచరించిన వ్రతాన్ని అదే పేరుతో ఒక దివ్య ప్రబంధంగా అనుగ్రహించింది. భగవత్సంశ్లేషంకోసం వ్రతాన్ని ఆచరించి ప్రార్థించినా స్వామి అనుగ్రహించనందున చాలా ఆర్తిని పొంది, నాచ్చియార్ తిరుమొళి అనే ఇంకొక ప్రబంధాన్ని అనుగ్రహిస్తూ, అందులో భగవానుని అనుగ్రహాన్ని పొందాలనే తన గాఢమైన కోరికను పలు విధాలుగా వ్యక్తం చేసింది. అందులో ఆరంభంలోనే శ్రీకృష్ణభగవానుని అనుగ్రహం తనకు కలిగేటట్లు సహాయపడవలసినదని కామదేవుని ప్రార్థించింది. ఆ సందర్భంలో గోదాదేవి శ్రీకృష్ణుని వేంకటేశ్వరునిగా భావించి పలికిన సూక్తులు మనకు స్పష్టంగా గోచరిస్తాయి. "కామదేవా! ఉన్నైయుమ్ ఉన్ తమ్బియైయుమ్ తొళుదేన్.వేంగడవఱ్కు ఎన్నై విదిక్కిత్తియే" (కామదేవా! నిన్ను నీ తమ్ముని ప్రార్థిస్తున్నాను నన్ను శ్రీ వేంకటేశ్వరునితో కలుపు) మొదలైన నాచ్చియార్ తిరుమ్మొళ్ లోని సూక్తులు దీనికి ఉదాహరణాలు.

ఆళ్వార్లు పలువురు శ్రీవేంకటేశ్వరుని శ్రీకృష్ణునిగా భావించి పలికిన ప్రయోగాలు అనేకంగా గోచరిస్తాయి. నమ్మాళ్వార్లు తిరువాయ్ మొళిప్రబంధంలో "కున్జమేన్ది కుళిర్ మళై కాత్తవన్. పరన్ శెన్రుశేర్ తిరువేఙ్గడమామలై ఒన్జుమే తొళ నమ్ వినై ఓయుమే" (గోవర్ధనపర్వతాన్ని ఎత్తి చల్లని వర్షంనుండి గోకులాన్ని కాపాడినవాడైన పరమాత్మ వచ్చి చేరిన వేంకటాచలాన్ని మాత్రం సేవిస్తే చాలు, మన పాపాలు తీరిపోతాయి) అని వేంకటేశ్వరుడు శ్రీకృష్ణుడే – అని అన్నారు. ఇటువంటి ప్రయోగాలు చాలా కన్పిస్తాయి.

శ్రీ వేంకటేశ్వరుని దివ్యసూరులు తమ ప్రబంధాలలో పలు చోట్ల స్తుతించారు. అక్కడ వారు శ్రీవేంకటేశ్వరునకు ప్రయోగించిన విశేషణాలకు, తిరుప్పావైలో గోదాదేవి శ్రీకృష్ణుని ఉద్దేశించి ప్రయోగించిన విశేషణాలకు మధ్య స్పష్టమైన సామ్యం శబ్దంలో, అర్థంలో గోచరిస్తుంది. దివ్యసూరులందరు ఐకకంఠ్యాన్ని కలవారనే విషయం "పేశిత్తే పేశలల్లాల్ ఇత్యాది బహుప్రమాణసిద్ధం. పూర్వాచార్యులు తమ వ్యాఖ్యానాలలో పలు సందర్భాలలో దీనిని నిరూపించారుకూడా.ఇందువల్ల, గోదాదేవి శ్రీకృష్ణునకు ప్రయోగించిన విశేషణాలకు, ఆళ్వారులు వేంకటేశ్వరునకు ప్రయోగించిన విశేషణాలకు మధ్య స్ఫురించే అర్ధసామ్యాన్ని, శబ్దసామ్యాన్ని బట్టి, ఆళ్వారుల సూక్తులకు, గోదాదేవిసూక్తులకు మధ్య గల ఐకకంఠ్యాన్ని బట్టి, తిరుప్పావైలో గోదాదేవి శ్రీకృష్ణునకు, వేంకటేశ్వరునకు మధ్య అభేదభావనతో పలికిందని భావించడంలో ఏ విధమైన అనుపపత్తి ఉండదుకదా! ఈ ఆంశం కొన్ని ఉదాహరణలతో వివరింపబడుతున్నది.

1) మొదటి పాశురంలో గోదాదేవి "నారాయణనే నమక్కే పఱై తరువాన్" (నారాయణుడు అయిన శ్రీకృష్ణుడు మనకు ప్రాప్యాన్ని ప్రసాదిస్తాడు) అని శ్రీకృష్ణుని నారాయణనామంతో నిర్దేశించింది.

తిరుమంగై ఆళ్వార్ పెరియ తిరుమ్మొ ప్రబంధంలో "భగవానుని నామాలను పలికినవారి పాపాలు తీరిపోతాయి" అని పలికే సందర్భంలో తిరుమలలో భక్తుల పాపాలను తీర్చడ కోసం వేంచేసిన స్వామిగా శ్రీ వేంకటేశ్వరుని భావిస్తూ, "పేశుమిన్ తిరునామ మెట్టెళుత్తుమ్ శొల్లి నిను పిన్ వరుమ్ పేశువార్ తమ్మై ఉయ్య వాఙ్గియ పిఱప్పుఱుక్కుమ్ పిరానిడమ్.తిరువేఙ్గడమడై నెఞ్జమే"(1–8–9)

అని వేంకటేశ్వరుని నారాయణ నామంతో నిర్దేశించారు. అష్టాక్షరీ మంత్రనామమైన నారాయణనామాన్ని చెప్పే వారి జన్మలను లేకుండాజేసి, వారు చేసే కైంకర్యాన్ని భగవానుడు స్వీకరిస్తాడు—— అని పై సూక్తిలో ఆళ్వారులు అన్నారు. అందువల్ల అష్టాక్షరీలోని "నారాయణాయ" అనే పదం శ్రీ వేంకటేశ్వరునికి నామమని వ్యక్తమవుతున్నది కదా! అటువంటి నారాయణుడే మనకు "పఱై" అనే కైంకర్యాన్ని అనుగ్రహిస్తాడు –అని గోదాదేవి తెలిపింది.

2) రెండవ పాశురంలో గోదాదేవి శ్రీకృష్ణుని "పాఱ్కడలుళ్ పైయిత్తుయిన పరమన్" అని కీరాబ్ధిశాయిగా నిర్దేశించింది.

శంఖాలను కలిగిన విశాలమైన పాలసముద్రంలో పరుండి ఉండే పుండరీకాక్షుడే శ్రీ కృష్ణుడుగా అవతరించి, తర్వాత తిరుమలలో శ్రీ వేంకటేశ్వరుడుగా నిలచి సేవ అనుగ్రహిస్తున్నాడు – అనే ఈ ఐక్యాన్ని తిరుమంగై ఆళ్వారులు "శబ్ద తఙ్గ తడఙ్కడల్ తామరైక్కణ్ణినన్. తిరువేఙ్గడమడై నెఞ్జమే"(1) (ఓ మనసా! శంఖాలను కల విశాలమైన సముద్రంలో పరుండి ఉండే పుండరీకాక్షుడైన శ్రీ వేంకటేశ్వరుని నీవు శరణు పొందు) అనే ప్రయోగంలో ఈ క్షీరాబ్ధిశయనుడు వేంకటేశ్వరుడే — అని అన్నారు.

3) మూడవ పాశురంలో గోదాదేవి శ్రీకృష్ణుని "ఓఙ్గ ఉలకు అళన్ద ఉత్తమన్" (లోకాలను త్రివిక్రముడై కొలిచిన ఉత్తముడు) అని కీర్తించింది.

తిరుమంగై ఆళ్వారులు కూడా శ్రీవేంకటేశ్వరుని "వేళ్వియిల్ శెన్ఱు మాణియాయ్ మణ్ కైయాల్ ఇరన్దాన్. తిరువేఙ్గడమడై నెఞ్జమే!" (1–8–5) (ఓ మనసా! యాగంలో మహాబలి దగ్గరకు వెళ్లి, అతని వద్ద నేలను యాచించినవాడైన వేంకటేశ్వరుని శరణు పొందు) అని అన్నారు. పొయ్ కై ఆళ్వారులు కూడా ఇదే

అర్థాన్ని ముదల్ తిరువన్దాది ప్రబంధంలో (76) అనుసంధిస్తూ "మణ్ణళన్ద శీరాన్ తిరువేఙ్గడమ్" (భూమిని కొలిచిన కీర్తిని అయిదవ పాశురంలో గోదాదేవి కలవాడు వేంకటేశ్వరుడు అని అన్నారు. ఈ విధంగా భూమిని కొలిచిన వైభవాన్ని కలవాడు వేంకటేశ్వరుడు – అని గోదాదేవి తిరుప్పావైలో "ఓఙ్గ ఉలగళన్ద ఉత్తమన్" అని అంటూ అనుభవించారు.

4) ఐదవ పాశురంలో గోదాదేవి శ్రీకృష్ణుని "మాయన్" (ఆశ్చర్యకరమైన స్వభావాన్ని కలవాడు) అని నామంతో నిర్దేశించింది.

తిరుమంగై ఆళ్వార్లు కూడా పెరియ తిరుమొళిప్రబంధంలో "శేయన్ అణియన్ ఎన్ శిన్దనైయుళ్ నిన్ఱ మాయన్ తిరువేఙ్గడమడై నెఞ్జమే!" (1–10–8) (తనను ఇష్టపడనివారికి అందనివాడు, తనను కొలిచేవారికి సులభుడైన వేంకటేశ్వరుని,ఓ మనసా! ఆశ్రయించు) అని అన్నారు. అటువంటి ఆశ్చర్యకరమైన స్వభావాన్ని కల వేంకటేశ్వరుని కదా గోదాదేవి తిరుప్పావై " "మాయన్" అనే విశేషణంతో అనుభవించింది.

5) ఆ పాశురంలోనే గోదాదేవి శ్రీకృష్ణుని "ఆయర్ కులత్తినిల్ తోన్ఱుమ్ అణి విళక్కై" అని గోకులంలో అవతరించిన అందమైన మంగళదీపంగా పలికింది.

తిరుమంగై అళ్వార్లు "శేయన్ వేఙ్గడమలై కోయిల్ మేవియ ఆయర్ నాయకఱ్కు అన్బు అడిమైతొళిల్ పూణ్డాయే" (2–1–8) అనే పాశురంలో తెల్లని ముత్యాలు ప్రవహించే చోటు అయిన తిరుమలను నివాసంగా ఆదరించినవాడు, మంగళ దీపం, గోపాలనాయకుడైన వేంకటేశ్వరునకు తమ మనసు కైంకర్యం చేస్తున్నదని ఆనందిస్తూ పలికారు. ఇంతేకాక, కృష్ణావతారం ఎత్తినవాడు, వేంకటేశ్వరుడు ఒకే వ్యక్తి – అని తోచేటట్లు ఆళ్వారులు "ఆయర్ నాయకఱ్కు" అని

అన్నారని మహావిద్వాన్ కాంచీ అణ్ణంగరాచార్యస్వామి వివరించారు. అటువంటి వేంకటేశ్వరుని గోదాదేవి "ఆయర్ కులత్తినిల్ తోన్టుమ్ అణివిళక్కు" అని పలికింది.

6) ఈ అయిదవ పాశురంలోనే గోదాదేవి "తాయ్రై క్కుడల్ విళక్కమ్ శెయ్ ద దామోదరన్" (తల్లి కడుపును ప్రకాశింపజేసిన దామోదరుడు) అని శ్రీకృష్ణుని కీర్తించింది.

ఈ దామోదర నామాన్ని నమ్మాళ్వార్ తిరువాయ్ మొళి ప్రబంధంలో "ఎన్ అముదమ్ కార్ ముకిల్ పోలుమ్ వేఙ్గడనల్ వెఙ్బన్. ఎన్టై దామోదరన్" (తిరువాయ్ మొళి 2–7–11) (నాకు అమృతంవంటివాడు, నల్లని మేఘంవంటివాడు, వేంకటేశ్వరుడు, నాకు తండ్రి అయిన దామోదరుడు) అని వేంకటేశ్వరుని విషయంలో దామోదరనామాన్ని అనుసంధించారు. ఈ విధంగా దామోదరనాముడైన వేంకటేశ్వరునే కదా గోదాదేవి కీర్తించింది.

7) ఏడవ పాశురంలో గోదాదేవి శ్రీకృష్ణుని "వెళ్ళత్తరవిల్ తుయిల్ అమర్ న్ద విత్తినై" (క్షీరాబ్ధిలో ఆదిశేషునిపై పరుండి ఉండే జగత్కారణరూపుడు) అని కీర్తించింది.

కులశేఖరులు పెరుమాళ్ తిరుమొళిలో వేంకటేశ్వరుని " ఒణ్ పవళ వేలై యులవు తణ్ పాఱ్కడలుళ్ కణ్ తుయిలు మాయోన్"(4–4) (పగడాలు కొట్టుకొని వచ్చే తీరాన్ని కల పాలసముద్రంలో నిద్రించే ఆశ్చర్యకరమైన స్వభావాన్ని కలవాడు) అని కీర్తించారు. గోదాదేవి కూడా శ్రీకృష్ణుని క్షీరాబ్ధిశయనునిగా కదా కీర్తించింది.

8) తిరుప్పావైలోని ఎనిమిదవ పాశురంలో గోదాదేవి " మావాయ్ పిళన్దానై" అని కేశి అనే అసురుని వధించినవాడు– అని శ్రీకృష్ణుని కీర్తించింది.

పూదత్తాళ్వార్ రెండవ తిరువందాది ప్రబంధంలో (8) వేంకటేశ్వరుని "వేఙ్గడత్తాన్ మున్నొరు నాళ్ మావాయ్ పిళన్ద మకన్" (పూర్వం ఒకనాడు కేశి అనే అసురుని నోటిని చీల్చినవాడు వేంకటేశ్వరుడు) అని ఈ అర్థాన్ని వేంకటేశ్వరుని విషయంగా అనుసంధించారు. ఇటువంటి వేంకటేశ్వరునే గోదాదేవి "మావాయ్ పిళన్దాన్" అని పలికింది.

9) ఈ పాశురంలో గోదాదేవి శ్రీకృష్ణుని "దేవాదిదేవన్" అని కీర్తించింది.

పూదత్తాళ్వారులు రెండవ తిరువందాదిలో (28)వేంటేశ్వరుని "ఎనైప్పలరుమ్ దేవాదిదేవన్ ఎనప్పడువాన్" అని దేవాధిదేవునిగా కీర్తించారు. ఈ నామంతోనే గోదాదేవి శ్రీకృష్ణుని కీర్తించింది.

10) పన్నెండవ పాశురంలో గోదాదేవి శ్రీకృష్ణుని "మనత్తుక్కు ఇనియాన్" (మనస్సుకు మధురమైనవాడు) అని అన్నది.

నమ్మాళ్వారులు వేంకటేశ్వరుని తిరువాయ్ మొళిప్రబంధంలో "ఎణ్ణమ్ పుకున్దు తిత్తిక్కుమ్ అముదే.తిరువేఙ్గడత్తానే" (మనస్సులో ప్రవేశించి, మధురంగా ఉండేవాడా! వేంకటేశ్వరా!) (6–10–3) అని కీర్తించారు.

11) తొమ్మిదవ పాశురంలో గోదాదేవి శ్రీకృష్ణభగవానుని "మా మాయన్ మాధవన్" అని కీర్తించింది.

తిరుమంగై ఆళ్వార్ పెరియ తిరుమొళిలో శ్రీ వేంకటేశ్వరస్వామిని "మాయనే! మాధవనే! వేఙ్గడవా!) అని ఈ పదాలతోనే నిర్దేశించారు.

12) పద్నాలుగవ పాశురంలో గోదాదేవి శ్రీకృష్ణుని "శఙ్గొడు శక్కరమ్ ఏన్దుమ్ తడ క్కైయన్" అని శంఖ చక్రధారిగా పలికింది.

కులశేఖరులు పెరుమాళ్ తిరుమొళి ప్రబంధంలో వేంకటేశ్వరుని స్తుతిస్తూ "కూనేరు శజ్గమిడత్తాన్దన్ వేఙ్గడత్తు" అని శంఖచక్రధారిగా పలికారు.

13) 16వ పాశురంలో, ఆ విధంగానే, ఇరవై ఆరవ పాశురంలో గోదాదేవి శ్రీకృష్ణుని "మణివణ్ణన్" అని నీలమణివర్ణునిగా తెలిపింది.

తిరుమంగై ఆళ్వార్లు కూడా వేంకటేశ్వరుని " వేఙ్గడమామలై మేయ మల్లార్ తిరడోళ్ మణివణ్ణనమ్మానై"(చాణూరముష్టికులనే మల్లయుద్ధ వీరులను వధించిన, బలిష్ఠమైన బాహువులను కలవాడైన శ్రీవేంకటేశ్వరుడు మణివర్ణుడు)(1–8–2) అని మణివర్ణునిగా పలికారు.

14) 22 వ పాశురంలో శ్రీకృష్ణుని గోదాదేవి "ఉలకినిల్ తోట్రమాయ్ నిన్జ శుడరే!" (లోకంలో అవతరించిన జ్యోతిస్స్వరూపా!) అని కీర్తించింది.

నమ్మాళ్వారుకూడా తిరువాయ్ మొళిలో "నిలవుమ్ శుడర్ శూళొళిమూర్తి" (6–10–1)అని, "పరమ్ శుడర్ శోది"(3–3–4)అని జ్యోతిర్మయునిగా కీర్తించారు.

15) ఇరవై ఆరవ పాశురంలో గోదాదేవి శ్రీకృష్ణుని "ఆలినిలైయాయ్" అని వటపత్రశాయిగా సంభావించింది.

తిరుమంగై ఆళ్వార్ కూడా "పట్టోరాలిలై పళ్ళికొణ్డవన్ తిరువేఙ్గడ మడై నెజ్జమే!" (పూర్వం ఒక అద్వితీయమైన మర్రిచిగురుటాకుపై శయనించిన స్వామి వేంచేసి ఉండే వేంకటాద్రిని, ఓ మనసా! ఆశ్రయించు) (1–8–6) అని వేంకటేశ్వరుని వటపత్రశాయిగానే భావించారు.

16) చివరిగా, ఇరవై ఆరవ పాశురంలో గోదాదేవి శ్రీకృష్ణుని "మాలే" (ఆశ్రిత వ్యామోహాన్ని కలవాడా)) అనే విశేషణంతో సంబోధించింది.

గోదాదేవి తండ్రిగారైన పెరియాళ్వార్లుకూడా వేంకటేశ్వరుని "కడియార్ పొళిలణి వేఙ్గడవా! కరుమ్ పోరేతే! మాలే!" (3–3–4) (సుగంధాన్ని వీచే తోటలను కల, అందమైన వేంకటాద్రిలో ఉండే నల్లని పోట్ల గిత్తవంటి వేంకటేశ్వరా! భక్తుల పట్ల వ్యామోహాన్ని కలవాడా!) అని సంబోధించారు.

ఈ విధంగా గోదాదేవి శ్రీకృష్ణుని ఉద్దేశించి తిరుప్పావైప్రబంధంలో ప్రయోగించిన విశేషణాలు శ్రీ వేంకటేశ్వరునకు తగి ఉన్నందున, గోదాదేవి శ్రీకృష్ణుని వేంకటేశ్వరునిగా సంభావించింది అని అనడంలో ఏవిధమైన అసామంజస్యం ఉండదు. కదా. అంతేకాక, గోదాదేవి తన రెండవ ప్రబంధమైన నాచ్చియార్ తిరుమొళిలో వేంకటేశ్వరుని ఉద్దేశించి మేఘసందేశాన్ని పంపించడంకూడా ఇక్కడ స్మరించాలి. ఈ విధమైన భావనకు సంప్రదాయంలో ధర్మైక్యమని పేరు.

ప్రబంధే శ్రీవ్రతాభిఖ్యే వేంకటేశస్వరూపిణః,
వైభవం గోదయా ప్రోక్తం కృష్ణస్యేత్థం నివేదితమ్.
దివ్యసూరిప్రయోగేషు భావైక్యం యద్ధి లక్ష్యతే,
తదేతదనుసంధాయ లేఖియం లిఖితా మయా.
క్షీరనీరనయేనాత్ర విషయం విమృశంత్వితి,
విజ్ఞాప్య సుధియామగ్రే సేయం లేఖా సమర్ప్యతే.

సాంప్రదాయిక వ్యాస మాలిక

# భగవద్గీత–గోదాగీత

భగవానుడనుగ్రహించిన భగవద్గీతకు, గోదాదేవి అనుగ్రహించిన తిరుప్పావైకు అనేక రీతులలో సామ్యాన్ని చెప్పవచ్చు. గీత అనే పేరు భగవద్గీతకు ప్రసిద్ధమైన పేరు అయినట్లే, గోదాదేవి పాడిన తిరుప్పావై కూడా గీత అని చెప్పదగినది. పేరులోనే కాక, అర్థంలోకూడా ఈ రెండిటికీ పలు విధాలైన సామ్యాలు ఉన్నాయి. భగవద్గీత ప్రతి అధ్యాయం చివర "ఇతి భగవద్గీతాసు ఉపనిషత్సు బ్రహ్మ విద్యాయామ్" అనే విశేషణం అనుసంధింపబడుతున్నది. "గీతాసు" అని బహువచనం ద్వారా ఒక్కొక్క అధ్యాయం ఒక్కొక్క గీత అని చెప్పవచ్చు. ఆ విధంగానే, తిరుప్పావైలో ఒక్కొక్క పాశురాన్ని ఒక్కొక్క పువ్వుగా చేసి, గోదాదేవి భగవానునకు సమర్పించింది. వేదాల సారం ఉపనిషత్తులు. అయిదవ వేదమైన మహాభారతానికి సారం భగవద్గీతోపనిషత్తు. ఆ విధంగానే, ద్రవిడవేదమైన నాలాయిరంలో సారమైన తిరుప్పావైకూడా ఒక ఉపనిషత్తు. ఉపనిషత్తులు బ్రహ్మ విద్యను ప్రతిపాదిస్తున్నాయి. బ్రహ్మవిద్యాఫలం నిరంతరబ్రహ్మానుభవమే. ఆవిధంగానే, తిరుప్పావై కూడా "నీరాట్టమ్" అనే నిరంతరబ్రహ్మానుభవాన్ని ప్రతిపాదిస్తున్నది.అందువల్ల తిరుప్పావైకూడా బ్రహ్మ విద్య అని చెప్పవచ్చు.

తిరుప్పావై –భగవద్గీతల మధ్య ఉండే సామ్యాన్ని ఇంకా మరి కొంత లోతుగా గమనించి చూడవచ్చు. భగవద్గీత జ్ఞానవైరాగ్యాలతో కూడిన భక్తిచే మాత్రమే పొందబడే పరబ్రహ్మ అయిన నారాయణునిగూర్చి భగవద్గీత విశదంగా తెలుపుతున్నది. ఈ విషయాన్ని "స్వధర్మ జ్ఞానవైరాగ్య సాధ్యభక్త్యైకగోచరః, నారాయణః పరం బ్రహ్మ గీతాశాస్త్రే సమీరితః" అని భగవద్యామునులు గీతార్థసంగ్రహంలో అన్నారు. నారాయణ శబ్దానికి అర్థం ఏమంటే అతడు సృష్టించి,

రక్షించి, లయం చేసే జగత్తుకు, ఆ స్వామికి మధ్య ఉండే సంబంధమే. ఆ సంబంధజ్ఞానమే అతనిపట్ల భక్తి కలగడానికి కారణం. అదే అతడు మనలను అనుగ్రహించడానికి కారణం అవుతున్నది. దీనిని చక్కగా వివరిస్తున్నది— శ్రీకృష్ణుడు ఉపదేశించిన గీతాశాస్త్రం. తిరుప్పావై కూడా" నారాయణనే నమక్కే పఱై తరువాన్" - మనకు నారాయణుడే పురుషార్థాన్ని అనుగ్రహిస్తాడు— అని మొదటి పాశురంలో గోదాదేవి నిశ్చయించి పలికింది. ఇతరదైవాలు ఎందరో ఉండగా, నారాయణుడే పురుషార్థాన్ని ఇస్తాడు అని అన్నందున తాము చేసే కార్యాలకు ఫలాన్ని అను గ్రహించేవాడు నారాయణుడే— అని తెలిపినట్లయినది. "నమక్కే పఱై తరువాన్" (మనకే పురుషార్థాన్ని ఇస్తాడు) అని అవధారణపూర్వకంగా అన్నందున "ఇతరులకు కాదు" అని తెలుస్తున్నది. ఇక్కడ "ఇతరులు" అంటే - భగవానుని ఆరాధించి అతని వద్ద తాము కోరిన ప్రయోజనాన్ని పొంది వెళ్ళిపోయే సంసారులు, దేవతలు మొదలైనవారు. వారి

కంటే తిరుప్పావైవ్రతాన్ని ఆచరించిన గోపికలు విలక్షణమైన స్వభావం కలవారు. దేశంకోసం మంచి వర్షం కురవాలనే ప్రయోజనాన్ని ఉద్దేశించి, "కేవలం పఱై అనే వాద్యాన్ని ప్రయోజనంగా పొందడకోసం మేము ఈ వ్రతం చేయడం లేదు, నీతోనే నిత్యమైన సంబంధాన్ని ఏ నాటికీ కలిగి ఉంటాము. నీకే స్వరూపానికి తగిన కైంకర్యాన్ని చేస్తాము" అని ప్రార్థించిన గోపికలు తమను "నమక్కే "అని నొక్కి పలకడం చాలా యుక్త మైనది. ఈ విధంగా గొప్పదైన ఫలాన్ని పొందడానికి తాము చేసిన పుణ్యం ఏమి? అనే విషయాన్ని కూడా వారు వివరిస్తూ "ఉందన్నై ప్పిఱవి పిఱన్దనై పుణ్ణియమ్ యాముడైయోమ్ "నీవు పుట్టిన గొల్లకులంలో పుట్టడమే మేము చేసిన పుణ్యం" అని అతనితో తమకు గల విడదీయరాని సంబంధమే అని అన్నారు.

ఇదేకదా నారాయణ శబ్దార్థం. ఇదే గీతలో వివరింపబడిన నారాయణ శబ్దంలోని అర్థం. కనుక, తిరుప్పావైకు భగవద్గీతకు విషయం శ్రీమన్నారాయణుడే– అని ఏర్పడుతున్నది.

అంతేకాక, ఉపదేశప్రధానమైన గీతలో, అనుష్ఠాన అనుభవప్రార్థనారూపమైన తిరుప్పావైలో ఉండే ఆంతరమైన అర్థాన్ని బట్టికూడా ఈ రెండిటి మధ్య సామ్యాన్ని చెప్పవచ్చు. గీతలో భగవానుడు తన స్వరూపరూప గుణవిభూతులను విస్తరించి పలుకడమేకాక, తనను పొందే మార్గాలను కూడా అర్జునునకు ఉపదేశించాడు. ఆ మార్గాలే – కర్మ జ్ఞాన భక్తి ప్రపత్తులు అనేవి.

కర్మయోగాన్ని వివరించేటప్పుడు– కర్మలను ఆచరించేవారిని కేవలం కర్మలను ఆచరించేవారు, జ్ఞానపూర్వకంగా కర్మలను చేసేవారు— అని కర్మ యోగులలో రెండు విధాలైన విభాగాలను భగవానుడు చూపించాడు. శాస్త్రాలలో చెప్పబడిన కర్మలను జ్ఞానాన్ని అంతర్భవించుకొన్నవి, జ్ఞాన సాధనాలు — అని తెలిసికొని వానిని ఆచరించేవారు కర్మయోగులు అనబడతారు. ఆ జ్ఞానంకూడా రెండు విధాలు. అనిత్యమైన ప్రకృతి కంటే విలక్షణమైనది–నిత్యమైన ఆత్మ–అనే సామాన్య జ్ఞానం. అటువంటి, నిత్యమైన ఆత్మ కూడా భగవానునకు శేషం అని, అతని ఆనందానికే ఉపయోగపడాలని భక్తిరూపాన్ని పొందిన జ్ఞానమే ఇంకొక విధమైన, విలక్షణమైన, పరిపూర్ణమైన జ్ఞానం. ప్రకృతివినిర్ముక్తమైన ఆత్మపర్యంతంలో నిలువకుండా, పరమాత్మను చేరి, అతనితో నిత్యమైన ఆనందాన్ని అనుభవించడమే ఆత్మ స్వరూపానికి తగినది — అనే ఆత్మకు సంబంధించిన జ్ఞానమే పూర్ణమైన జ్ఞానం ఆనబడుతుంది. ఇటువంటి భక్తితో చేసే క్రియలు భగవానుని ఆనందం కోసం చేసే తదారాధనాలు అవుతున్నాయి — అని గీతలో కర్మ

జ్ఞాన భక్తుల స్వరూపం నిరూపింపబడింది. ఈ కర్మ జ్ఞానభక్తులనే మూడు మార్గాల కంటే విలక్షణమైనది, వాటి కంటే అన్ని విధాలుగా గొప్పది అయిన ప్రపత్తి అనే మార్గాన్ని గీతలో భగవానుడు చివరిలో ఉపదేశించాడు. తనకు విరోధి అయిన ప్రకృతిని, చిరకాలంగా చేసిన పుణ్యపాపరూప కర్మల బాహుళ్యాన్ని చూచి, తన శక్తిని, అజ్ఞానాన్ని చూచి, దుఃఖపడకుండా, సర్వశక్తి, తనను శరణు పొందిన వారిని, వారి దోషాలను చూడకుండా, రక్షించే స్వభావాన్ని కలవాడైన భగవానుని శరణు పొంది, అతనికి పరతంత్రమై ఉండడమే ప్రపత్తి. ఇది సర్వాధికారం. దీనికి దేశ కాలనియమాలు లేవు. ఇది గీతలోని సారమైన అర్థం.

తిరుప్పావైలోకూడా ఈ విషయాలు విస్తృతంగా తెలుపబడడం గమనించవచ్చు. గోపికలు తిరుప్పావై వ్రతాన్ని ఆచరించారు. ఈ క్రియ కేవలం వ్యాజమాత్రమే. దీనికి ప్రయోజనంగా వారు ముఖ్యంగా ఉద్దేశించినది ఏమంటే — భగవానుని చేరి పలు రీతులలో పాడి ఆనందించి, అతనిని ఆనందింపజేయడమే. కనుక ఈ నోము భగవానునకు చేసే ఒక విధమైన కైంకర్యంగా, అతని ఆరాధనారూపంగా ఉన్నందున, భగవద్గీతలో చెప్పబడిన కర్మ యోగస్థితికి గోపికలను ఉదాహరణగా చెప్పవచ్చు. వారి జ్ఞానం ప్రకృత్యాత్మవివేకంతో వచ్చినది అని అనడానికి అవకాశం లేదు. జ్ఞానయోగాన్ని ఆచరించడానికి వారు అధికారులు కారు. అయితే, సర్వేశ్వరుడు వారి కులంలో అవతరించాడు, వారు తన బంధువులు— అని అతడే చెప్పే భాగ్యాన్ని పొందినవారు. మనవంటివారికి జ్ఞానం అతని అనుగ్రహంవల్ల పొందవలసి ఉన్నది. గోపికలకు ఆ జ్ఞానం పుట్టుకతోనే వచ్చింది. అందువల్ల అది కర్మ జ్ఞానయోగసహకృతమైన సాధ్యభక్తి కాదు. జ్ఞానం, భక్తి జన్మతః వారు పొందరు. ఇటువంటి గొప్పతనాన్ని కలిగిన గోపికలు భగవద్గీతలో

చెప్పబడిన జ్ఞానభక్తియోగులకంటే గొప్పవారు ఈ విధంగా విడదీయరాని సంబంధాన్ని భగవానునితో తాము కలిగి ఉన్న విషయాన్ని అతనికి నివేదించి, తమ వ్రతానికి వాద్యవిశేషం మాత్రమే ఫలంగా పొంది విరమించకుండా, అతనితో ప్రతి జన్మలోనూ అవినాభావసంబంధాన్ని కలిగి ఉండి, ఆ స్వామికి అంతరంగ కైంకర్యం చేయడమే తమ వ్రతంలోని వ్రతంలోని ఉద్దేశ్యం అని తెలిపే గోపికలు ప్రపన్నుల కంటే గొప్పవారు అని అనడంలో సందేహం లేదు. ఈ విధంగా భగవద్గీతలో శ్రీకృష్ణుడు ఉపదేశించిన తత్త్వార్థాలను తాము ఆచరించడం ద్వారా ఇతరులకు గోపికలు ఉపదేశించారు ఈవిధంగా. పటై అనే వాద్యవిశేషాన్ని శ్రీ కృష్ణుని వద్ద అర్థించే వ్రతవృత్తాంతం ద్వారా గోదాదేవి పలికే గీత భగవద్గీతవలె అందరికీ ఉపజీవ్యం అవుతున్నది అని అనడంలో ఏ సందేహం లేదు.

ఇంకా ఇంకొక రీతిలో కూడా ఈ రెండు గీతల మధ్య సామ్యాన్ని చెప్పవచ్చు. శ్రీకృష్ణుడు గీతలో భక్తి మాహాత్మ్యాన్ని వివరించే సందర్భంలో భక్తులు పొందే దశలను, వారు అనుభవించే రీతులనుగూర్చి "మచ్చిత్తా మద్గతప్రాణా బోధయంతః పరస్పరమ్, కథయంతశ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతి చ" అనే ఒక శ్లోకాన్ని పలికాడు. (వ్యాసపరాశరులవలె) నాలో మనసును నిలిపినవారు, (నన్ను విశ్లేషిస్తే ప్రాణాన్ని నిలుపుకోలేని ఆళ్వారులవలె) నన్ను ప్రాణంగా కలవారు, (మాతృ- సఖీ నాయకీదశలను పొంది, పలికే నమ్మాళ్వారులవలె) విశ్లేషంలో నన్ను గూర్చి పలికి, విని ఆనందిస్తూ ప్రాణాలను నిలుపుకునే వారు- అని భక్తులను గురించి వివరించాడు. భగవదనుభవం అనేది మానసికమైన సంశ్లేషవిశ్లేషరూపంగా ఉంటుంది. ఈ విధమైన మానసిక సంశ్లేషమనేది ఏకాంతంగా, విశ్లేషమనేది సామూహికంగాను ఉంటుందనే విషయాన్ని ఆళ్వార్లు గోపికలు మనకు తెలియజశారు. తిరుప్పావై ప్రబంధంలో ఇటువంటి అనుభవాన్ని మనం

గమనించవచ్చు. శ్రీకృష్ణ భగవానుని విశ్లేషాన్ని సహించలేని గోపికలు ఆ స్వామి సంశ్లేషాన్ని కోరి వ్రతాన్ని ఆచరించారు. అందరూ కలసి నిద్రించే శ్రీకృష్ణభగవానునకు సుప్రభాతాన్ని పలకడంకోసం వారు ప్రయత్నించారు. ఈ సందర్భంగా కొందరు నిద్రిస్తూ ఉన్నట్టు, మరి కొందరు వారికి సుప్రభాతం పలుకుతున్నట్లు ప్రబంధంలో కన్పిస్తుంది. ఈ విధంగా పది పాశురాలలో పది మంది గోపికలు నిద్రలేపబడ్డారు. నిద్రలేపబడే వీరందరూ దివ్యసూరులే అని పూర్వాచార్యులు తమ వ్యాఖ్యానాలలో తెలియజేశారు. అయితే, ఇక్కడ ఆళ్వార్లకు చెప్పబడిన నిద్ర ఎటువంటిది? ఏకాంతంలో వారు మౌనంగా నిద్రిస్తున్నట్లు చెప్పబడిన విషయాన్ని గమనిస్తే, లోకంలో కోరినవారితో ఏకాంతంగా సంశ్లేషంలో మునిగి, ఉలుకు పలుకు లేకుండా ఉండేవారివలె, పరిపూర్ణమైన బ్రహ్మానుభవంలో ఆళ్వార్లు మునిగి ఉన్నారని చెప్పవచ్చు. ఈ విధంగా భగవానుని విశ్లేషంలో ఆర్తిని పొందిన గోపికలు, ఈ దివ్యసూరులు ఏకాంతానుభవాన్ని తీర్చి, వారితో కలసి భగవదనుభవాన్ని పొందాలి—— అనే భావంతో వారిని నిద్ర లేపడం తగినదే. సమానమైన స్వభావం కలిగిన దివ్యసూరులు, గోపికలు ఒకరితో ఒకరు కలిసి, భగవానుని వద్దకు వెళ్లి, తమ ఆశయాన్ని విన్నవించడం తిరుప్పావై ప్రబంధంలో కనబడుతుంది. దివ్యసూరులు తమ ప్రబంధాలలో తాము ఏకాంతంగా పొందిన భగవదనుభవాన్ని పలు రీతులలో వ్యక్తం చేశారు. తిరుప్పావైలో అందరూ కలసి ముక్తకంఠంగా " నిన్ను ఏనాటికి విశ్లేషించము. నీకే కైంకర్యానికి చేస్తాము" అని భగవానుని సన్నిధిలో విన్నవించడమే తిరుప్పావైలోని అంతరార్థం. అందువల్లనే మిగిలిన దివ్యసూరుల ప్రబంధాలను వేదసమానాలుగా, తిరుప్పావైప్రబంధాన్ని అన్ని వేదాలలో సారతమమైన అర్థాలను తెలిపే ఉపనిషత్తుల స్థానంలో నిలిపి, మన పూర్వాచార్యులు ఆ ప్రబంధాన్ని చాలా ఆదరించారు.



# శ్రీకృష్ణగీత – శ్రీగోదాగీత

**యత్తత్త్వం చ హితం పరం ఫలమపి శ్రీకృష్ణదేవః స్వయం**
**గీతాయాం ప్రకటీచకార వచనైః త్రయ్యంతసారై శ్శుభైః,**
**తాని శ్రీవ్రతనామకే కృతివరే గోదా ఽ బ్రవీదిత్యయం**
**శ్రీగీతాసమతా ముపేత్య లసతీత్యాచక్షతే దేశికాః.**

ఏ గొప్పదైన తత్వాన్ని, హితాన్ని, ఫలాన్ని శ్రీకృష్ణపరమాత్మ స్వయంగా ఉపనిషద్రూపాలైన, మంగళకరాలైన వచనాలతో భగవద్గీతలో వ్యక్తం చేశాడో, వాటిని గోదాదేవి తిరుప్పావై అనే గొప్పదైన ప్రబంధంలో పలికింది – అనే కారణంచేత ఈ ప్రబంధం భగవద్గీతతో సామ్యాన్ని పొంది ప్రకాశిస్తున్నది – అని ఆచార్యులు అంటారు.

భారతీయులమైన మనం వైదికులం. మన మతం వైదిక మతం. వేదమే మనకు మొట్టమొదటి ప్రమాణం. ఈ వేదం అనాది. ఈ జగత్తు పుట్టడానికి ముందు కూడా అది సంస్కార రూపంలో ఉన్నది. భగవంతుడు సృష్టి కాలంలో దానిని స్మరించి, పూర్వం ఉన్నట్లుగానే మళ్లీ బ్రహ్మకు ఉపదేశించాడు. మిగిలిన గ్రంథాలు అన్ని ఎవరో ఒక కర్తచేత రచింపబడినట్లుగా, వేదాలు ఎవరి చేతను రచింపబడినవి కావు. అందువల్ల వాటికి అపౌరుషేయాలు అని పేరు. మహర్షులు మంత్రద్రష్టలు మాత్రమే. తమ తపఃశక్తి వల్ల వేదాలను వారు దర్శించారు. అంతే తప్ప, వాటిని వారు రచించలేదు. వేదాలను నశింపజేయడం ఎవరి వల్ల కాదు. వేదాలు జ్ఞాన రూపాలు అయినందున, అవి సార్వకాలికాలు. వేదాలు ఏ విధంగా సనాతనమైనవో, నిత్యమైనవో, ఆ వేదాలను ఆధారంగా చేసుకుని ప్రవర్తించిన వైదిక మతం కూడా సనాతనమైనది, నిత్యమైనది అని కీర్తింపబడుతున్నది.

ఈ వేదం కర్మకాండ అని, బ్రహ్మకాండ అని రెండు విధాలుగా ఉన్నది. ఉపనిషత్తులు అని చెప్పబడే వేద భాగాలు అన్ని ఇంచుమించుగా జ్ఞానకాండలోనే ఉన్నాయి. భారతదేశంలో ప్రచారంలో ఉండే వైదిక మతాలలో మూడు మతాలు ప్రధానంగా ప్రసిద్ధి చెందాయి. అవి అద్వైతం విశిష్టాద్వైతం అనే మూడు మతాలు. ఈ మూడు వేదాలను ఆధారంగా చేసుకుని ప్రవర్తించినవే.

ఇటువంటి సాటి లేని వైభవాన్ని కలిగిన వేదంలోని సారాన్ని అంతటినీ శ్రీకృష్ణ భగవానుడు, మహాభారతంలో అంతర్గతమై, ఆ మహాభారత సారంగా చెప్పబడే భగవద్గీత రూపంలో ఉపదేశించాడు. శ్రీ ఆదిశంకరుల పరంపరకు చెందిన శ్రీమధుసూదన సరస్వతి అనే పండితులు భగవద్గీతా ధ్యానశ్లోకాన్ని రచిస్తూ ఈ విధంగా అన్నారు.

"సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనందనః,
పార్థో వత్సః సుధీః భోక్తా దుగ్ధం గీతామృతం మహత్"

(ఉపనిషత్తులు అన్నీ గోవులవంటివి. శ్రీకృష్ణుడు ఆ గోవుల దగ్గరనుండి పాలను తీసే గోపాలకుడు. అర్జునుడు లేగదూడ వంటివాడు. పండితులు ఆ పాలను అనుభవించే భోక్తలు. శ్రీకృష్ణ భగవానుడు అనే గోపాలకుడు వేదాలు అనే గోవుల దగ్గర నుండి తీసిన అమృతం వంటి పాలు భగవద్గీతయే)

ఈ శ్లోకాన్ని బట్టి చూసినప్పుడు, గీత ఉపనిషత్తుల సారం అని తెలుస్తుంది. శ్రీకృష్ణుడు భగవద్గీతలోని 15 అధ్యాయాలలో ఉండే ఏడు వందల ఇరవై ఒక్క శ్లోకాలలో వేదసారాన్ని గ్రహించి వ్యక్తం చేశాడు. ఈ భగవద్గీతలో సారంగా చెప్పదగిన శ్లోకాలు మూడు ఉన్నాయి. అందులో మొదటి శ్లోకం

"మత్తః పరతరం నాన్యత్ కించి దస్తి ధనంజయ!,
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణి గణా ఇవ. "(7–7)

దీని అర్థం ఏమంటే– "అర్జునా! నాకు మించిన ఏ పరతత్వం లేదు. ఈ లోకం అంతా నాలో, ఒక దారంలో మణుల సమూహంవలె, కూర్చబడి ఉన్నది"–అని.

ఈ శ్లోకంలో మనకు "మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి ధనంజయ!" అనే మొదటి వాక్యం ముఖ్యమైనది. ఈ వాక్యం "శ్రీకృష్ణుడే పరతత్వం" అని తెలుపుతున్నది. శ్రీకృష్ణుడు శ్రీమన్నారాయణుని అవతారమే కనుక, నారాయణుడే పరతత్వం అని చెప్పబడినట్లయినది. వేదంలో కూడా నారాయణానువాకంలో "నారాయణః పరం బ్రహ్మ తత్వం నారాయణః పరః" అని చెప్పబడింది.

ఇక భగవద్గీతలోని ముఖ్యమైన రెండవ శ్లోకం ఏమంటే,

"దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా,
మామేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే"(7 – 14)

దీని భావం ఏమంటే, దివ్యమైన ఈ మాయను దాటడం చాలా కష్టం. ఎవడు నన్నే శరణు పొందుతున్నాడో, అతడు మాత్రమే ఈ మాయను దాటగలడు– అని.

దీనినిబట్టి ఈ సంసారం అనే మాయను దాటడానికి ఉపాయం శ్రీకృష్ణుడుగా అవతరించిన శ్రీమన్నారాయణుడే అని చెప్పినట్లయినది.

ఇక, మూడవ శ్లోకం, శ్రీకృష్ణ చరమ శ్లోకంగా చెప్పబడే, భగవద్గీతలో చివర కనిపించే శ్లోకం.

"సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ,
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః" (18 –65)

అనేదే ఆ శ్రీకృష్ణ చరమ శ్లోకం.

ఇందులో సారంగా శ్రీకృష్ణుడు ఏమన్నాడంటే – అర్జునా! నీవు అన్ని ధర్మాలను విడిచిపెట్టి, నన్ను ఒక్కని మాత్రమే శరణు పొందు. నేను నిన్ను అన్ని పాపాల నుండి విడిపిస్తాను. నీకు మోక్షాన్ని అనుగ్రహిస్తాను. నీవు విచారించవద్దు–అని.

ఈ విధంగా శ్రీకృష్ణుడు భగవద్గీతలో ఉపదేశించిన ఈ మూడు శ్లోకాలు కూడా శ్రీవైష్ణవ సంప్రదాయంలో అతిముఖ్యమైన మూడు అర్థాలను, అంటే, తత్వం, హితం పురుషార్థం అనే మూడు విషయాలను విశదీకరిస్తున్నాయి.

1) శ్రీ మన్నారాయణడే పరతత్వం అనే తత్వం మొదటి శ్లోకం వల్ల,

2) అతనిని ఒక్కనిమాత్రమే శరణు పొందడమే ఉజ్జీవనానికి దారి అనే హితం రెండవ శ్లోకం వల్ల,

3) పొందదగిన లక్ష్యం మోక్షం దానిని ఇచ్చేవాడు శ్రీమన్నారాయణుడే అనే పురుషార్థం మూడవ శ్లోకంలోని రెండవ భాగం వల్ల వ్యక్తమవుతున్నాయి.

వేదం అనేది మన మతానికి మూల ప్రమాణంగా ఉన్నప్పటికీ, దానిని అధ్యయనం చేయడానికి కానీ, దాని అర్థాన్ని తెలుసుకోవడానికి కానీ కొన్ని నియమాలు ఉన్నాయి. ఏ విధంగా శాస్త్ర పరిశోధనకు ఆవశ్యకమైన ఉపకరణాలు, శీతోష్ణం, ఇంకా మొదలైన కొన్ని సామగ్రి ఆవశ్యకమై ఉన్నదో, ఆ విధంగానే వేదాలను తెలుసుకోవడానికి కొన్ని పరికర సంపత్తి ఆవశ్యకమై ఉన్నది. వాటిని గ్రహించడం అందరికీ సాధ్యం కాదు. అయితే, మనవంటి సామాన్య జనులుకూడా వేదంలోని సారమైన అర్థాన్ని తెలుసుకోవాలి అని ఋషులు, మునులు ఎంతగానో ప్రయత్నించారు. అందువల్లే వారు వేదార్థాలను విశదీకరించే ఇతిహాసపురాణాలను రచించి మనకు అందించారు.

ఉదాహరణకు తైత్తిరీయోపనిషత్తులో, ఆచార్యుడు, శిష్యులకు వేదాన్ని బోధించిన తరువాత, ఆ శిష్యుడు లౌకిక జీవనాన్ని ఆరంభించేటప్పుడు అతడు తెలుసుకోవలసిన ధర్మాలను గూర్చి తెలుపుతూ మొదటి భాగంలో (తైత్తిరీయ ఉపనిషత్తులోని శీక్షావల్లి చివరిలో) " సత్యం వద, ధర్మం చర, సత్యా న్న ప్రమదితవ్యం, ధర్మాన్న ప్రమదితవ్యమ్" అని మొదలుగా ఉపదేశిస్తాడు– అని తెలుపబడింది. దీని అర్థం ఏమంటే, " నిజాన్ని చెప్పు, ధర్మాన్ని ఆచరించు, సత్యం పలకడం నుండి ప్రమాదపడకు, ధర్మం ఆచరించడం నుండి ప్రమాదపడకు" అని. ఈ అర్థాలను వివరించడం కోసమే వ్యాసభగవానుడు మహాభారతంలో హరిశ్చంద్రోపాఖ్యానం ప్రస్తావించాడు. వాల్మీకి మహర్షి రామాయణాన్ని రచించాడు. ఇది అంతా ఇక్కడ ఎందుకు చెప్పబడుతున్నది అని అంటే, అన్ని పురాణాలు, ఇతిహాసాలు వేదాలను వివరించడం కోసంగానే ప్రవర్తించాయి– అని చెప్పడం కోసమే.

ఇటువంటి ఇతిహాసాలలో ఒకటైన శ్రీరామాయణంలో శ్రీరాముడు విభీషణునకు అభయాన్ని ఇచ్చేటప్పుడు ఈ విధంగా పలికాడు.

"సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే,
అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ"

(ఎవడు, "నేను నీవాడనై ఉన్నాను"– అని నా దగ్గర శరణు పొందుతున్నాడో, అతనికి నేను వెంటనే అభయాన్ని ఇస్తున్నాను. ఇది నా వ్రతం). ఇది గీతా చరమ శ్లోకంవంటిదే. అందుచేత, వేదంలో మనకు ఉపదేశింపబడిన ఒక ముఖ్యమైన తత్వం ఏమంటే, భగవంతుని శరణు పొందడమే మనకు తరించటానికి తగిన ఉపాయం –అని.

శ్రీవైష్ణవ సంప్రదాయంలో పెద్దలను ఉభయ వేదాంత ప్రవర్తకులు అని వ్యవహరించడం పరిపాటి. దీని అర్థం ఏమంటే, రెండు వేదాంతాలను తెలుసుకున్నవారై, వాటి అర్థాలను నిర్వహించేవారు– అని అర్థం. సంస్కృత వేదాంతం, ద్రావిడ వేదాంతం అనే రెండిటిని చక్కగా తెలుసుకున్నవారు, వీరు. దివ్యసూరులు అనబడే ఆళ్వారులు అనుగ్రహించిన దివ్యప్రబంధాలు ద్రావిడ వేదాంతాలు అని చెప్పబడతాయి. 12 మంది ఆళ్వార్లు ఇంచుమించుగా నాలుగు వేల పాశురాలను కలిగిన 24 ప్రబంధాలను అనుగ్రహించారు. వారు అందరూ వేరు వేరు కాలాలలో అవతరించారు. అయితే, వారు పైన తెలిపిన గీతలోని సారాన్ని చాలా స్పష్టంగా తమ ప్రబంధాలలో వ్యక్తం చేశారు. శ్రీమన్నారాయణుని విషయంలో భక్తిని కలిగి ఉండడమే మన కర్తవ్యం, మోక్షాన్ని పొందడం మన లక్ష్యం, ఆ పరమపురుషార్థాన్ని ఇచ్చేవాడు ఆ శ్రీమన్నారాయణుడే – అనే, వేదంలో చెప్పబడిన, గీతలో తెలుపబడిన తత్వహిత పురుషార్థాలనే ఆళ్వారులు తమ ప్రబంధాలలో మనకు ఉపదేశించారు.

ఈ 12 మంది ఆళ్వారులలో స్త్రీజాతిలో అవతరించినవారు గోదాదేవి. ఈమెకే ఆండాళ్ అని పేరు. ఈమె అనుగ్రహించిన ప్రబంధాలు రెండు. కోదై అనేది ఈమె ద్రావిడనామం. ఈ పేరుకు అందమైన కేశపాశాన్ని కలిగినది అని అర్థం. ఇది సంస్కృతంలో గోదా అని మారింది. కోదై అనే ఈ ద్రావిడనామాన్ని గోదా అనే సంస్కృత నామంగా మార్చి ప్రయోగించిన మొట్టమొదటి ఆచార్యులు భట్టర్. గోదా అనే పదానికి సంస్కృత భాషలో భూమిచేత అనుగ్రహింపబడినది– అని అర్థం ఈ గోదాదేవి సీతాదేవివలె అయోనిజ, అంటే, తల్లి కడుపులో గర్భవాసం చేసి జన్మించినది కాదు. . పెరియాళ్వార్లు ఈమెను నందనవనంలో చూచి, ఆదరంగా

తమ ఇంటికి తీసుకుని వచ్చి, గారాబంగా పెంచారు. ఈమె భూదేవి అంశతో అవతరించింది అని పెద్దలు అంటారు. శ్రీవేదాంతదేశికులు తమ గోదాస్తుతి అనే స్తోత్రంలోని మొదటి శ్లోకంలో గోదాదేవి సాక్షాత్తు భూదేవి అని తెలియజేశారు.

"సాక్షాత్ క్షమాం కరుణయా కమలామివాన్యాం
గోదా మనన్య శరణః శరణం ప్రపద్యే"

అనేది వారి సూక్తి.

వరాహ పురాణంలో వరాహమూర్తి భూదేవిని హిరణ్యాక్షుని బారినుండి కాపాడి రక్షించినప్పుడు, ఆమెకు కొన్ని ధర్మాలను ఉపదేశం చేశాడు. వాటిని తాను ఆచరించి, మనకు తెలుపడం కోసం ఆ భూదేవి గోదాదేవిగా అవతరించి, 143 పాశురాలను కల, గోదాసూక్త ప్రబంధాన్ని అనుగ్రహించింది. నాచ్చియార్ తిరుమొழி అని ఈ ప్రబంధానికి పేరు. ఈ గోదాదేవి అనుగ్రహించిన ఇంకొక ప్రబంధం 30 పాశురాలను కలిగిన తిరుప్పావై ప్రబంధం. భగవద్రామానుజులు ఈ 30 పాశురాలను ఎల్లప్పుడూ అనుసంధానం చేస్తూ ఉండేవారు. అందువల్లనే వారికి తిరుప్పావై జీయర్ అనే పేరు వచ్చింది.

15వ శతాబ్దంలో జీవించిన వేదప్పిరాన్ భట్టర్ అనేవారు తెంగలై సంప్రదాయానికి చెందిన ఆచార్యులలో ఒకరు. వీరు గోదాదేవికి వాழி తిరునామం రచించారు. అంతేకాదు, గోదాదేవి అవతరించిన శ్రీవిల్లి పుత్తూరును, ఇంకా, తిరుప్పావై ప్రబంధాన్ని చాలా ఉన్నతంగా కీర్తించారు. తిరుప్పావై ప్రబంధాన్ని పొగడుతూ వారు చెప్పేటప్పుడు,

"వేదమ్ అనైత్తుక్కుమ్ విత్తాకుమ్ కోదైతమిழ் ఐయైందుమైందుమ్ అఱియాద మానిడరై వైయమ్ శుమప్పదుమ్ వంబు"(వేదానికి అంతటికి విత్తనం

వంటి గోదాదేవి అనుగ్రహించిన ద్రావిడ ప్రబంధం అయిన 30 పాశురాలను కలిగిన తిరుప్పావై ప్రబంధాన్ని తెలియని వారిని భూమి మోయడం వ్యర్థం) అని అన్నారు. ఈ 30 పాశురాలు వేదానికి అంతటికి బీజప్రాయం వంటివి.

అయితే, ఇక్కడ మనకు ఒక సందేహం కలుగుతుంది. వేదం అనాదికాలంలో ఉన్నది కదా. నిత్యమైనది కదా. తిరుప్పావై ఈ కలియుగంలో అవతరించింది. ఆ విధంగా ఉండగా, ఈ తిరుప్పావై ప్రబందం వేదానికి ఏ విధంగా విత్తనం అవుతున్నది? అని.

పై పాశురంలోని తాత్పర్యం– తిరుప్పావై ప్రబంధమే వేదానికి కారణం –అని కాదు. విత్తనం అనేది వృక్షం, శాఖలు, పువ్వులు, పళ్ళు అనే వీటిని అన్నిటినీ తన లోపల సూక్ష్మంగా అంతర్భవించుకొని ఉంటుంది. ఆ వృక్షసారంగా ఉంటుంది. ఆ విధంగానే, తిరుప్పావై ప్రబంధం కూడా వేదంలోని సారంగానే ఉన్నది– అని ఇక్కడ తాత్పర్యం. ఇది ఏ విధంగా వేదసారమై ఉన్నది అనే విషయాన్ని ఇప్పుడు సంగ్రహంగా చూద్దాం.

1) మనం, వేదంలోని సారమైన గీతలో పరతత్వం శ్రీమన్నారాయణుడే –అని శ్రీకృష్ణుడు చెప్పిన విషయాన్ని చూశాము. దానిని శ్రీకృష్ణుడు గీతలో, ఏడవ అధ్యాయంలో చెప్పాడు. అయితే, ఆండాళ్ తల్లి తిరుప్పావై ప్రబంధంలోని మొదటి పాశురంలోనే " నారాయణనే నమక్కే పఱై తరువాన్"(నారాయణుడే మనకే వాద్యాన్ని ఇస్తాడు) అని నిర్ధారణను తెలిపే ఏవకారాన్ని ఉపయోగించడం ద్వారా పరతత్వ నిర్ణయాన్ని చేసినది. శ్రీకృష్ణుడే నారాయణుడు అనే విషయాన్ని మొదటిలో ఉండే "నందగోపన్ కుమారన్, యశోదై ఇళమ్ శింగమ్" అని మొదలైన

ప్రయోగాలతో వివరించింది. శ్రీభాగవతం కూడా "కృష్ణస్తు భగవాన్ స్వయమ్" – అంటే, శ్రీకృష్ణుడు శ్రీమన్నారాయణుడే అని నిశ్చయించి పలికింది.

2) ఆ పరతత్వాన్ని శరణు పొందడమే మనం చేయవలసిన కర్తవ్యం. ఈ విషయాన్ని పైన ప్రస్తావించిన గీతలోని 7– 14, 18 –66 శ్లోకాలు తెలుపుతున్నాయి. గోదాదేవి ఈ విషయాన్ని ఐదవ పాశురంలో "దామోదరనై తొழுదు" అని మొదలైన పలు పాశురాలలో మనకు తెలిపింది.

3) పొందవలసిన, పొందదగిన లక్ష్యం మోక్షం. ఆశమోక్షాన్ని ఇచ్చేవాడు ఆ శ్రీమన్నారాయణడే. మొదటి పాశురంలోనే ఈ విషయాన్ని ఆండాళ్ తల్లి "నారాయణనే నమక్కే పఱై తరువాన్"(నారాయణుడే మనకే వాద్యాన్ని ఇస్తాడు) అని నిర్ధారణను తెలిపే ఏవకారాన్ని ప్రయోగించి, నిశ్చయించి పలికింది. ఇక్కడ "పఱై" అనే పదం నోముకు ఆవశ్యకమైన వాద్యవిశేషం, అయితే, ఇది బాహ్యామైన అర్థం. ఇక్కడ లోపలి అర్థం ఏమంటే, మోక్షపురుషార్థమే. భగవంతుని కైంకర్యమే. గోదాదేవి తిరుప్పావై ప్రబంధంలో నారాయణనామాన్ని మొదటి పాశురంలో, పదవ పాశురంలో ప్రయోగించింది. అక్కడ అంతట "పఱై" అనే పదాన్ని కూడా ప్రయోగించింది. అందుచేత మోక్షం ఇచ్చేవాడు నారాయణుడే –< అని చాలా స్పష్టంగా నిశ్చయించి పలికింది.

4) శ్రీవైష్ణవ సంప్రదాయంలో మోక్షం అనేది శ్రీవైకుంఠాన్ని చేరి, భగవంతునకు నిత్య కైంకర్యం చేయడమే. దీనిని ఆండాళ్ 29వ పాశురంలో చివర భగవత్కైంకర్యాన్ని "ఉనక్కే నామ్ ఆట్చెయ్ వోమ్" (నీకే దాస్యాన్ని చేస్తాము) అని అంటూ అర్థించింది. వేదాలు పలు వేల మంత్రాల ద్వారా మనకు తెలియజేసిన అర్థాలను శ్రీకృష్ణుడు పలు నూర్ల శ్లోకాలలో తెలియజేశాడు. ఆ అర్థాలను ఆండాళ్ తల్లి సంగ్రహించి, 30

పాశురాలలో మనకు అందించింది. అందువల్ల వేదం అంతా ఒక వృక్షంగా భావిస్తే, తిరుప్పావై ప్రబంధం దానికి బీజం వంటిది అవుతుంది. అంతేకాదు, వేదాలు చాలా రహస్యంగా చెప్పిన విషయాలను కరతలామలకంగా, చాలా స్పష్టంగా తెలిసేటట్లుగా ఆండాళ్ తల్లి మనకు బోధించింది. అందుచేత భగవద్భక్తులమైన మనమందరం తిరుప్పావై ప్రబంధాన్ని అధ్యయనం చేసి, దానిలోని అర్థాలను పెద్దల ద్వారా తెలిసికొని, మన జన్మసార్థక్యాన్ని పొందుదాం. ఆ విధంగా చేయకపోతే, పైన వేదప్పిరాన్ భట్టర్ చెప్పినట్టుగా, "గోదాదేవి అనుగ్రహించిన 30 పాశురాలను కలిగిన తిరుప్పావై ప్రబంధాన్ని తెలియనివారిని భూమి మోయడం దండుగ "అనే మాటను సార్థకం చేసినవారం అవుతాం. అంటే, మనం భూమికి భారమే అవుతాము.

★★★★★

# శ్రీరామాయణం –తిరుప్పావై ప్రబంధం

మన సంప్రదాయం భగవద్రామానుజ సంప్రదాయం. మన సంప్రదాయం ఉభయవేదాంతసంప్రదాయం. మన పూర్వాచార్యులు అందరూ సంస్కృత వేదాంతానికి, ద్రావిడ వేదాలుగా చెప్పబడే దివ్య ప్రబంధాలకు మధ్య ఉండే అర్థసామ్యాలను అనేక విధాలుగా, సప్రమాణంగా దివ్యప్రబంధ వ్యాఖ్యానాలలో నిరూపించారు. ప్రస్తుతం, గోదాదేవి అనుగ్రహించిన తిరుప్పావై ప్రబంధానికి, శ్రీరామాయణానికి మధ్య ఉండే కొన్ని అర్థసామ్యాలను పూర్వాచార్య వ్యాఖ్యానాల మూలంగా సంగ్రహంగా గమనిద్దాం.

తిరుప్పావై ప్రబంధంలోని మొదటి పాశురంలో గోదాదేవి "మార్గழித్తింగళ్ మది నిఱైంద నన్నాళ్" (మార్గశిర మాసం, చంద్రుడు నిండుగా ఉండే పౌర్ణమి, మంచి దినం) అని మాసాన్ని, పక్షాన్ని కీర్తించింది. ఈ విధంగా గోదాదేవి కాలాన్ని కీర్తించడానికి గల కారణం ఏమి? అని వివరించే వ్యాఖ్యాత నాయనార్, భగవత్సంబంధాన్ని కలిగి ఉండడమే కాలాన్ని కీర్తించడానికి కారణం– అనే సమాధానం చెప్పారు. ఏ కాలం మనలను భగవంతుని దగ్గరకు చేరుస్తుందో, అదే కదా మంచి కాలం. ఇంత కాలంగా మనం పనికిరాని లౌకిక విషయాలలో ఆసక్తిని కలిగి ఉన్నాము. ఇప్పుడే ఆ భగవంతునితో చేరాలి, ఆ స్వామిని ఆశ్రయించాలి– అనే ఆసక్తి కలిగి, అందుకోసం ప్రయత్నిస్తున్నాము. అందువల్ల ఈ సమయం చాలా మంచి సమయం –అనే ఉద్దేశంతోనే గోదాదేవి ఇక్కడ కాలాన్ని పొగడుతున్నది. భగవంతుడు కూడా గీతలో " మాసానాం మార్గశీర్షో ౽,,హమ్" అని తాను మార్గశిర మాసమని అన్నాడు. చంద్రుడు నిండుగా ఉండే పున్నమి దినం భగవదనుగ్రహం వల్ల లభించింది–. అనే ఉద్దేశంతో గోదాదేవి ఇక్కడ కాలప్రశంసను చేస్తున్నది.

ఈ విధంగా కాలాన్ని కీర్తించిన సందర్భంగా ఏదైనా ఉన్నదా? అని ప్రశ్నించి, వ్యాఖ్యాత నాయనార్, ఆఛాయిరప్పడి వ్యాఖ్యానంలో శ్రీరామాయణంలోని ఒక సందర్భాన్ని ఉదాహరణగా ప్రస్తావిస్తున్నారు. శ్రీరామాయణంలోని. "చైత్రః శ్రీమానయం మాసః పుణ్యః పుష్పితకాననః" అనే శ్లోకాన్ని ఉదాహరించి, దానికి చాలా అందమైన వివరణను అనుగ్రహిస్తున్నారు. మాసం "శ్రీమాన్. ", అంటే, సంపద కలిగిన మాసం. శ్రీరామచంద్రునకు ఈ సమయంలో పట్టాభిషేకం చేయాలి —అని నిర్ణయించిన మాసం కదా. అందుచేత ఆ మాసం చక్కని, మంచి చైత్రమాసం అయినది. దానిని ప్రత్యేకంగా అలంకరించవలసిన అక్కర లేకుండా, సహజంగానే అంతటా పూలతో అలంకరింపబడిన వనాలను కలిగి ఉన్నందున, సుందరంగా ఉన్నది. పూలతో నిండిన వసంత ఋతువుగా భాసిస్తున్నది— అనే వాల్మీకి శ్రీరాముని పట్టాభిషేకంతో సంబంధం కలిగినందున చైత్రమాసాన్ని కీర్తించారు— అని నాయనార్ వివరించారు. మిగిలిన దైవాలందరి కంటే భగవంతునకు ఒక వైలక్షణ్యం ఉన్నట్టే, అతడు దైవాలందరిలోనూ మొదటివాడు అయినట్లే, మాసాలు అన్నిటిలోను చైత్రమాసానికి ఒక విశిష్టత ఉన్నది. మాసాలు అన్నిటిలోనూ చైత్రమాసం మొదటి మాసం అయినది. భగవంతుడు ఏవిధంగా ప్రభువులకు అందరికి ప్రభువై ఉన్నాడో, ఆ విధంగానే, చైత్రమాసం కూడా మాసాలన్నిటికీ ప్రభువువై ఉన్నది. "అయం మాసః"— పట్టాభిషేకానికి సన్నిహితమైన గొప్పతనాన్ని కలిగిన మాసం, ఇది, "పుణ్యః" – పవిత్రమైనది —అని నాయనార్ వ్యాఖ్యానించారు. ఆ విధంగానే భగవంతుని ఉద్దేశించి చేసే ధనుర్మాస వ్రతం పరమ పవిత్రమైనది. దానిని ఆచరించటానికి సన్నిహితమైన మాసం, దినం, కనుక, పరమ పవిత్రమైనది. గోదాదేవి ఈ కాలాన్ని "నన్నాళ్" అని కీర్తిస్తున్నది.

తరువాత, గోదాదేవి రేపల్లెలోని గోపికలను "శెల్వ ච్చిఱుమీర్ కాళ్" (సంపదను కలిగిన చిన్న పిల్లలారా!) అని సంబోధించింది. ఇక్కడ గోపికలకు కల

సంపద ఏమి? అనే విషయాన్ని ప్రశ్నించి, వ్యాఖ్యాత, దీనికి సమాధానంగా ఇంకొక శ్రీరామాయణ సూక్తిని ఉదాహరించి వివరిస్తున్నారు. ఇక్కడ గోపికలకు ఉండే సంపద భగవంతుని విషయంలో ఉండే భక్తియే. భగవంతుని దగ్గరకు చేరాలి అనే అభినివేశమే. భగవంతుని ఆశ్రయించాలి, ఆ స్వామిని సేవించాలి అనే మనోరథథమే. అదే ఇక్కడ సంపదగా చెప్పబడుతున్నది. దానిని ఇక్కడ గోదాదేవి "శెల్వమ్" అనే పదంతో నిర్దేశించింది.

భగవద్భక్తియే నిజమైన సంపదగా చెప్పబడుతున్నది –అనే విషయాన్ని నిరూపించడానికి వ్యాఖ్యాన చక్రవర్తి పెరియవాచ్చాన్ పిళ్లై శ్రీరామాయణంలోని రెండు శ్లోక రత్నాలను ప్రమాణంగా గ్రహించి, వివరించారు. అందులో మొదటిది –"లక్ష్మణో లక్ష్మిసంపన్నః "అనేది. లక్ష్మణుడు అయోధ్యలో ఐశ్వర్యాలను అనుభవిస్తూ ఉండే సమయ లో అతనిని "లక్ష్మిసంపన్నః" అని వాల్మీకి అనలేదు. మరి ఎప్పుడు అన్నారు? అంటే, నార బట్టలను కట్టుకొని, శ్రీరామునకు కైంకర్యాన్ని చేయడానికి కావలసిన సాధనాలైన తవ్వుగోల, పళ్ళబుట్ట మొదలైనవానిని చేతబట్టుకొని, పాదచారియై శ్రీరాముని వెంట అరణ్యాలకు వెళ్లే సమయంలో అతనిని "లక్ష్మణో లక్ష్మిసంపన్నః "– లక్ష్మణుడు ఐశ్వర్య సంపన్నుడు– అని వాల్మీకి మహర్షి అన్నారు. అంతఃపురాన్ని, రాజధానిని, అమూల్యమైన వస్త్రాలను, ఆభరణాలను, సుఖ భోగాలను అన్నిటిని విడచిపెట్టి, శ్రీరామునకు " అహం సర్వంకరిష్యామి "అనే విధంగా సర్వదేశ సర్వకాల సర్వావస్థలలోనూ తగిన సేవలను చేయడానికి సిద్ధపడిన లక్ష్మణుని ఉద్దేశించి ఈ విధంగా వాల్మీకి మహర్షి అన్నారు.

అదేవిధంగా, విభీషణుడు లంకను విడచిపెట్టి, తన పత్నీపరి జనాలను విడచిపెట్టి, అన్ని భోగాలను విడచిపెట్టి, శ్రీరాముని ఆశ్రయించటానికి వచ్చిన సందర్భంగా, "అంతరిక్ష గతః శ్రీమాన్" అని లక్ష్మీసంపన్నుడని వాల్మీకి మహర్షి

అతనిని కీర్తించారు. "పరిత్యక్తా మయా లంకా మిత్రాణి చ ధనాని చ"(నేను లంకను మిత్రులను ధనాన్ని విడిచిపెట్టి వచ్చాను) అని అంటూ విభీషణుడు చెప్పిన సమయంలో అతనిని ఈ విధంగా వాల్మీకి మహర్షి ఐశ్వర్యవంతుడని అన్నారు. ఈ విధంగా అన్ని సంపదలను, బంధువులను, మిత్రులను అందరినీ విడిచిపెట్టి వచ్చిన విభీషణుని "శ్రీమాన్" అని అనవచ్చునా? వాస్తవానికి అప్పటికి ఇంకా విభీషణునకు భగవత్సంబంధం ఏర్పడనే లేదు. భగవత్సంబంధాన్ని పొంది, భగవంతుని ఆశ్రయించడానికి వెళుతున్నాడు విభీషణుడు, అంతే. తావమాత్ర దశలోనే ఉండే విభీషణుని "శ్రీమాన్" అని వాల్మీకి మహర్షి కీర్తించారు కదా. ఇలా ఎందుకు కీర్తించారు? అంటే, " వీడుమిన్ ముற்றவుమ్" (భగవద్విషయం కంటే ఇతరమైన అన్ని విషయాలను పూర్తిగా విడువండి) అని చెప్పిన రీతిలో విడువవలసినవాటిని అన్నిటిని విడచి పెట్టాడు కదా, విభీషణుడు. అతనికి వాల్మీకి మహర్షి లక్ష్మిసంపన్నుడని అన్నారు. ఈ విధంగానే, ఇక్కడ గోపికలు అన్య విషయాలను అన్నిటినీ విడిచిపెట్టి, శ్రీకృష్ణునే సర్వస్వంగా భావించి, అతని సంబంధాన్ని పొందాలని, ఆ స్వామిని ఆశ్రయించాడనే కుతూహలంతో ఉన్నవారు కదా. అందువల్ల వారు సంపద కలిగినవారే– అని గోదాదేవి ఉద్దేశం. అందువల్ల ఇక్కడ గోపికలకు చెప్పబడిన సంపద భగవత్సంబంధం ఏర్పడడానికి తగిన అనువైన స్థితియే. దీనిని నిరూపించటానికి వ్యాఖ్యాత శ్రీరామాయణ నుండి లక్ష్మణుని, విభీషణుని ఉదాహరణగా గ్రహించి వివరించారు. , ఇహలోక సంపదను ఉద్దేశించి కాకుండా భగవత్ సంబంధమనే సంపదను దృష్టిలో పెట్టుకునే లక్ష్మణుని, విభీషణుని వాల్మీకి లక్ష్మిని కలిగినవారని చెప్పినట్లే, ఇక్కడ గోదాదేవి కూడా భగవద్విషయంలో ఆసక్తిని, ఆ స్వామి ఆశ్రయించాలనే ఆశను ఇక్కడ సంపదగా తెలియజేస్తున్నది –అని వ్యాఖ్యాత వివరించారు.

ఇదే విధంగా, గోదాదేవి శ్రీకృష్ణ పరమాత్మను ““శెంగణ్” అని అంటూ ఎర్రని నేత్రాలను కలిగినవాడని కీర్తించింది. భగవంతుని నేత్రాలు ఎర్రదనం కలిగి ఉండడానికి గల కారణాలను రెండు, మూడు విధాలుగా వ్యాఖ్యాత నాయనార్ నిర్వహించారు. భగవంతుడు వాత్సల్యం కలిగి ఉండడాన్ని ఆ స్వామి కన్నుల ఎర్రదనం సూచిస్తుంది– అని ఒక విధమైన నిర్వాహాన్ని తెలియజేసిన తరువాత, వేరొక అందమైన నిర్వాహాన్ని కూడా నాయనార్ తెలియజేశారు. శ్రీరంగంలోని అధ్యయనోత్సవాలలో రాపత్తు ఉత్సవాన్ని సేవించినవారి కన్నులు నిద్రలేమి వల్ల ఎర్రగా ఉండేటట్లే, భగవంతుని కన్నులు కూడా ఎర్రగా ఉంటాయి. ఎందుకంటే, అతడు ఇంత కాలంగా భక్తులను విశ్లేషించి ఉన్నాడు కదా. ఆ విశ్లేషం వల్ల కలిగిన ఆర్తిచేత అతని కన్నులు ఎర్రబడతాయి. భక్తులను ఇంత కాలంగా విడచి ఉన్నదాని వల్ల అతనికి కలిగిన ఆర్తి భగవంతుని కన్నులలోని ఎర్రదనం సూచిస్తుంది అంటారు, నాయనార్. నమ్మాళ్వారులు భగవంతుని గూర్చి పలుకుతూ, “ఎన్నిల్ మున్నమ్ పారిత్తు” (నాకంటే ముందుగా ఆశపడి) అని తమ కంటే ముందుగా భగవంతుడే తమ విషయంలో ఎక్కువగా ఆశపడ్డాడని అన్నారు. ఆ ఆశను భగవంతుని కన్నులలోని ఎర్రదనం సూచిస్తున్నదని అన్నారు.

ఈ విధంగా భగవంతునకుభక్తునకు కంటే ఎక్కువ ఆర్తి, ఆశ ఉంటుందనే విషయం ఎక్కడైనా తెలుపబడిందా? అని అంటే, దానికి వ్యాఖ్యాత శ్రీరామాయణంలోని ఒక సూక్తిని ప్రమాణంగా ఉదాహరించారు. సీతాదేవి హనుమంతునితో తాను శ్రీరామచంద్రుని విడచి ఒక మాసానికి మించి ఉండలేనని పలుకుతూ, “ఊర్ధ్వం మాసాన్న జీవిష్యే” (శ్రీరాముని విడచి ఒక నెలకు మించి నేను జీవించలేను) అని అన్నది. ఈ విషయాన్ని హనుమంతుడు శ్రీరామునకు తెలియజేసినప్పుడు, శ్రీరాముడు బదులు పలుకుతూ, సీత అయితే నన్ను విడచి ఒక

నెల జీవిస్తానని అన్నది, జీవించగలనని అన్నది. కానీ, నేనైతే ఆమెను విడచి ఒక్క క్షణం కూడా జీవించలేను. "న జీవేయం క్షణమపి" అని అన్నాడు. సీత శ్రీరాముని విడచి ఒక నెల కాలం జీవిస్తానని అన్నది. కానీ, శ్రీరాముడు ఆమెను విడచి ఒక్క క్షణం కూడా బ్రతకలేనని అన్నాడు ఈ విధంగా అనడంలో ఏమి తాత్పర్యం? అని గమనించినప్పుడు, శ్రీరాముని విషయంలో సీతకు ఉండే ప్రేమ కంటే, ఆమె విషయంలో శ్రీరామునకు ఉండే ప్రేమ అధికం అని కదా అర్థమవుతున్నది. అంటే, భక్తునకు భగవంతుని విషయంలో ఉండే ప్రీతి కంటే, ఆ భగవంతునకు భక్తుని విషయంలో ఉండే ప్రీతి అధికం– అని తాత్పర్యం. ఈ అధికమైన ప్రీతియే భగవంతుని కన్నులలో ఉండే ఎఱ్ఱదనం సూచిస్తుంది. భగవంతుని పొందడం కోసం జీవుడు పడే ఆరాటం కంటే, ఆ భక్తుని పొందడం కోసం భగవంతుడు పొందే ఆరాటం ఎక్కువ. ఈ విషయము ఇక్కడ గోదాదేవి ప్రయోగించిన "శెంగణ్" అనే పద ప్రయోగం ద్వారా ధ్వనిస్తున్నది– అని నాయనార్ వివరించారు. ఈ సాంప్రదాయికమైన రహస్యమే కదా భగవద్గీత లోని "ప్రియో హి జ్ఞానినో ऽ త్యర్థ మహం స చ మమ ప్రియః" అనే గీతాశ్లోకంలోని "స చ మమ అత్యర్థం ప్రియః" అనే పదాల యోజన ద్వారా ధ్వనిస్తున్నది. ఈ రహస్యమే తిరువాయ్ మొழி ప్రబంధంలోని చివరి పాశురంలో గల " ఎన్నవా అఱ చ్చూழ்న్దాయ్" అనే ప్రయోగం ద్వారా ద్వారా ధ్వనిస్తున్నది.

ఈ విధంగా మన పూర్వాచార్యులు తిరుప్పావై ప్రబంధంలోని ఒక్కొక్క పాదంలో గల ఆ యా ప్రయోగాల స్వారస్యాన్ని వివరించేటప్పుడు, ఆ ప్రబంధంలోని అర్థాలకు, శ్రీరామాయణంలోని అర్థాలకు కల సామ్యాన్ని చాలా హృద్యంగా వివరించారు.

